# శ్రీకృష్ణ దేవరాయలు

రచన :

డాక్టర్ అంతటి నరసింహం

సంపాదకులు :

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు




ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం

# శ్రీకృష్ణ దేవరాయలు

ర చ న :

డాక్టర్ అంతటి నరసింహం

సంపాదకులు :

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు



ప్ర చు ర ణ :

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

# SRI KRISHNA DEVARAYALU
by Dr. Anthati Narasimham

**తెలుగు విశ్వవిద్యాలయం**
హైదరాబాదు - 500 004

ప్రథమ ముద్రణ : 1988
ప్రతులు : 2000

**వెల : మూడు రూపాయలు**

విగ్రహ రూపకల్పన : శ్రీ కె. జి. వేలుస్వామి
ముఖపత్ర రచన : శ్రీ సుబ్రహ్మణ్యం
అక్షరాలంకరణ : శ్రీ ఎ. శేఖర్
ఫొటోలు : జనతా స్టూడియోస్

ప్రతులకు :
**తెలుగు విశ్వవిద్యాలయం**
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
3-5-850, హైదర్‌గూడ,
హైదరాబాదు - 500 029.

ముఖచిత్ర ముద్రణ :
**ది ప్రింటర్ [ఆఫ్‌సెట్]**
3-6-584/హెచ్, హిమాయత్‌నగర్,
హైదరాబాదు - 500 029.



# సందేశం

నిద్రాముద్రితమైన జాతిని జాగృతం చేసి, భద్రాయిత మూర్తిగా తీర్చిదిద్దిన మహావ్యక్తుల పవిత్ర జీవిత చరిత్రలు మన చిన్నారులకు ఉత్తేజకారకాలు; ఉత్సాహప్రేరకాలు. రేపటి పౌరులైన బాల బాలికలలో మంచి నడవడినీ, గట్టి పట్టుదలనూ, కలిసికట్టుతనాన్నీ, దేశభక్తినీ, సేవాసక్తినీ, మాతృ భాషానురక్తినీ పెంపొందించడానికి ఈ రీతి రచనల ప్రచురణ ఎంతైనా అవసరం.

ఈ గ్రంథ పరంపర ప్రచురణకు రూపకల్పన చేసిన తెలుగు విశ్వ విద్యాలయం వారికి మనఃపూర్వకమైన అభినందనాలు; ఉత్తమాశయ మహితమైన ఈ ఉద్యమంలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను భాగస్వామ్యం వహించిన సంస్కృతి ప్రియులకు సాహితీవరులకు కళాభివందనాలు.

హైదరాబాదు,
విభవ ఉగాది,
మార్చి 18, 1988.

'కళాప్రపూర్ణ'
**నందమూరి తారక రామారావు**
కులాధిపతి, తెలుగు విశ్వ విద్యాలయం



ఆచార్య తూమాటి దొణప్ప
ఎం.ఏ, పిఎచ్.డి, డి.లిట్.,
కులపతి,
తెలుగు విశ్వవిద్యాలయం.

# ఆముఖం

తెలుగుజాతికి మహోజ్జ్వలమైన చరిత్ర ఉంది. విశాలమైన ఈ తెలుగు నేలను ఎందరో రాజన్యులు పరిపాలించారు. మరెందరో మాన్యులు, మహనీయులు దీనిని సుస్థిరమే కాదు, సుసంపన్నం గావించారు. రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా, సాహితీ సంస్కృతి పరంగా, మత సామరస్యంతో ఆంధ్ర దేశాన్ని పురోగమింపజేశారు.

పరికించి చూస్తే ఇక్కడ ప్రతి రంగంలో ఒక యుగకర్త కనిపిస్తాడు; ఒక తేజోమూర్తి దర్శనమిస్తాడు. అపూర్వమైన సాహితీ సృష్టితో తెలుగు సాహితీ మంజూషను మణి

మయం చేసిన కవివరేణ్యులు; పద సాహితీ సంపదతో తెలుగు నేలను సరస సంగీత స్వర గంగాతరంగితం చేసిన వాగ్గేయకారులు; నూతన నృత్య వైయాత్యాలు అందించిన నాట్యాచార్యులు; అనల్పకల్పనా చాతురీ మహిమతో శిల్ప ప్రాభవాన్ని అందించిన శిల్పి శేఖరులు; నాటక రంగాన్ని శిఖరాయమాణం చేసిన నటశిఖామణులు; జాతీయోద్యమాలలో నడుం బిగించి ముందుకు దూకిన వీర యోధులు; చీకటి కమ్ముకొన్న వేళ జాతి యావత్తు సుషుప్త్యవస్థలోకి జారిపోయే టప్పుడు వెన్నుతట్టి, మేల్కొలిపి, చేయూత నిచ్చి, జాతిని చైతన్య చకచ్చకితం చేసిన వైతాళికులు; తమ అమేయ మేధాసంపత్తితో, ఆధునిక విజ్ఞానశాస్త్ర సారంతో ఆంధ్ర దేశాన్ని వ్యావసాయికంగా, పారిశ్రామికంగా ప్రగతిపథంలోకి నడిపించిన విదేశీయులు, స్వదేశీయులు; మత సహిష్ణుతను పెంపు చేసిన మహా నాయకులు, చరిత్ర పురుషులు ఎందరో ఉన్నారు.

ప్రాతఃస్మరణీయులైన ఈ మహనీయుల విగ్రహాలకు రూపకల్పన చేసి సమవేదికపై

ప్రాణప్రతిష్ఠ గావించి సజీవ మూర్తులుగా 'తెలుగు వెలుగులమూర్తి నిక్షిప్త కళా ప్రాంగణం' పేరిట హైదరాబాద్‌లోని టాంక్ బండ్‌పై నెలకొల్పిన ఘనులు, యశోధనులు మన ప్రియతమ ముఖ్యమంత్రి మాన్యశ్రీ నందమూరి తారక రామారావుగారు.

ఈ తెలుగు వెలుగుల జీవిత విశేషాలను అక్షరబద్ధం చేయాలని మేము సంకల్పించాం. ఇవి భావితరాలను ప్రభావితం చేస్తాయనీ, చక్కటి స్ఫూర్తి నిస్తాయనీ మా విశ్వాసం. అందుకే ఈ ప్రాంగణంలోని ప్రతి మూర్తి గురించి సరళ శైలిలో క్లుప్త చరిత్రను రచింపజేసి 'తెలుగు వైతాళికులు' పేరిట లఘు రచనలుగా వెలువరింపజేశాం. ఇందుకు తమ తోడ్పాటును అందజేసిన రచయితలకు మా కృతజ్ఞతలు. ఈ పుస్తక పరంపరకు సంపాదకులుగా వ్యవహరించి మాతో సహకరించిన శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారికి మా ధన్యవాదాలు!

తేదీ 5-3-1988,

హైదరాబాద్-500 004.

మా మాటల దొంతర

# శ్రీకృష్ణ దేవరాయలు

మన పూర్వులయిన మహా పురుషుల గురించి తెలుసుకోవడం, స్మరించుకోవడం మన అభిమానానికి ప్రతీకం. వారు సామాజికరంగంలో ఏ ఉత్కృష్ట సేవలందించారో, రాజకీయ రంగంలో యే ఉన్నత స్థాయి నందుకున్నారో సారస్వతాది కళారంగాల్లో యే ఉన్నత శిఖరాలందుకున్నారో తెలుసుకున్నపుడు, అద్భుతానందాలతో పులకిత గాత్రులమైపోతాం. తదాదర్శంతో ముందడుగిడడానికి ఉద్యమిస్తాం.

ఆంధ్ర మహా పురుషులలో మహాశక్తి మంతుడుగా, యుక్తిమంతుడుగా, జేతగా, నేతగా, కవిరాజుగా, నాట్యనాటకాది కళాపారంగతుడుగా, గానకళాధురీణుడుగా వాసికెక్కిన మహా మనీషి శ్రీకృష్ణదేవరాయ మహారాయలు. ఆయన రాజకవి. కవిరాజు. రసాలంకారశాస్త్ర నిపుణుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు. సంస్కృతాంధ్ర బాషా పండిత పండితుడు. పద్య విద్యా శిల్పి. సార్థకపద ప్రయోక్త. ఆంధ్ర భాషామాత సత్పుత్రుడు. కన్నడంలో పండితుడు, కవి గూడా. తమిళం గూడా బాగా తెలిసినవాడు.

ఆంధ్ర భాష అంటే రాయలకు ఎనలేని అభిమానం. అతనికి తెలుగు కలకండ వంటిది. సర్వభాషా ప్రాంత సామంత రాజులు నిత్యమూ కొలుస్తూ వుండగా అన్ని భాషలనూ నిత్య వ్యవహారంలో వింటూ, అన్ని భాషా కవిత్వాలనూ నిత్యమూ సేవిస్తూ, అన్నిటికంటే తెలుగు భాషే తీయనిది అని తేల్చి అక్షరాలా లిఖించిన మహాంధ్రకవి శ్రీకృష్ణదేవ రాయలు. ఈ మాట తన నోటితో గాక శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు చేత చెప్పించారు.

తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకండ
యెల్ల నృపులు గొలువ యెరుగవే బాసాడి
దేశభాషలందు తెలుగు లెస్స

అట్టి తెలుగులో ఆముక్తమాల్యద వ్రాయవలసింది అని దేవుడే సెలవిచ్చాడు.

ఏ భాష నేర్చుకోవాలన్నా అ, ఆ లతోనే ప్రారంభించాలి. అట్టి అకారాన్ని ఆదిలోనే గలిగినది ఆంధ్రభాష. అందుకు అది అభినందనీయమైన భాష. ఆంధ్రేతరులచేత సైతం అందమైనది అని కీర్తింపబడిన భాష.

చక్కని పలుకుబడి, సుశ్రావ్యమైన వాణి, గుండ్రని ముత్యాల వంటి అక్షరాలు, ఇవి ఆంధ్రభాషకు వరాలు.

తీరుతీయని ద్రవిడానికీ, సరసప్రౌఢ సంస్కృతానికీ కలిగిన కలయిక ఫలరూపమైన భాష, సర్వాంగ సుందరమైన భాష, సర్వ సమర్థమైన భాష, సాటి సోదరీ భాషలైన అరవానికి కొంత దూరంగా, కన్నడానికి కొంత దగ్గరగా వున్న యీ తెలుగుభాష పుట్టుటలో, యెదుగుటలో, ప్రౌఢత్వాన్ని సంతరించుకొనడంలో, స్వాతంత్ర్యాన్ని పెంపొందించుకోవడంలో, -కన్నడ సోదరినే యెక్కువగా అనుసరించింది.

కన్నడ భాష ప్రాక్కన్నడం నుండి హొసగన్నడ రూపాన్ని ధరించగానే అంతవరకూ తెళ్గన్నడ రూపంగా వ్యవహరింపబడుతూ, వచ్చిన ఇది, కొద్దిగా స్వాతంత్ర్యాన్ని పెంపొందించుకుంటూ, వ్యక్తిత్వాన్ని పెంచుకుంటూ 'కన్నడ' శబ్దాన్ని వదిలేసి 'గు' అనే స్వతంత్ర ప్రత్యయాన్ని తగిలించుకొని తెళిగు (తెళ్గు) అయి, తెళుగు అయి, తర్వాత తెలుగుగామారింది. 'తెన్' అంటే ద్రావిడంలో దక్షిణం గాబట్టి, మొదట ఈ ప్రాంతాలను పరిపాలించిన ఆంధ్రులు ఉత్తరాది నుండి వచ్చిన వారు గాబట్టి, వారు తమ పాలిత ప్రజలను దక్షిణాది వారు అని వ్యవహరించడం చేత తెనుగు వారు అనీ, వారి భాష తెనుగు అనీ వ్యవహరింపబడుతూ వచ్చింది.

పరిపాలకులు ఆంధ్రులు గాబట్టి ఆంధ్ర అన్న పేరు గూడా వచ్చింది.

మొదట దేశీయ ఛందస్సులో సీసము, కందము, ద్విపద, తరువోజ మొదలయిన పద్య రూపాలతో కవిత ల్లు కుంటూ యెనిమిదవ శతాబ్ది దాటిన తర్వాత సంస్కృత సాహచర్యాన్ని ఎక్కువగా పెంపొందించుకుంటూ పది పద కొండు శతాబ్దాలకు సంస్కృత ప్రాబల్యం గలిగిన పద్య రూప కవితలను వెలయించింది ఈ భాష.

సంస్కృతంలో యతి ప్రాసలు లేవు. కన్నడంలో యతి లేదు. ప్రాస మాత్రముంది. తమిళంలో అక్షరమైత్రి వుంది. అంత్యప్రాస వుంది. కాని తెలుగులో యతిప్రాసలు రెండూ అధికంగా చోటు చేసుకున్నాయి. అందుకే తెలుగులో పద్యం చాలా అందంగా వుంటుంది, గాని వ్రాయడం చాలా కఠిన విద్యగా తయారయింది.

ఇట్టి స్థిరరూపం పొందిన తొలిదినాల్లో సంస్కృతం నుండి పురాణాలను అనువదించే కృషిని చేపట్టారు మన కవులు. నన్నయ, తిక్కన, ఎర్రన, పోతన్నలు భారత భాగవతాలను అనువదించగా భాస్కరుడు, రంగనాథుడు మొదలయినవారు రామాయణాన్ని అనువాదం చేశారు. ఇంకా ప్రౌఢంగా వుండాలన్న ధోరణిలో శ్రీనాథుడు, పినవీర

భద్రుడు, నాచనసోముడు మొదలయినవారు సంస్కృతం లోని ప్రౌఢ కావ్యాలను అనువదింపసాగారు. అంతేగాని స్వతంత్ర కావ్యసృష్టి అంతగా జరగలేదు.

తర్వాత కొన్ని దశాబ్దాలు దాటిన యనంతరం గాని స్వతంత్ర ప్రబంధ సృష్టి జరగలేదు. ఆ యుగానికి మూల పురుషుడు శ్రీకృష్ణదేవరాయలే. ఆంధ్ర సరస్వతికి అమూల్యా భరణాలైన మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద, పారిజాతాపహరణము, ప్రభావతీ ప్రద్యుమ్నము, పాండు రంగ మాహాత్మ్యము మొదలయిన స్వతంత్ర ప్రబంధ నిర్మాణం ఈ రాయల యుగంలోనే జరిగింది. ఆయన ప్రోత్సాహ సహకారాల వల్ల అయింది. ఆయన స్వతంత్ర కావ్యనిర్మాణ దృష్టి వల్ల అయింది.

సాహితీ సమరాంగణ సార్వభౌముడుగా కీర్తింపబడిన వాడు శ్రీకృష్ణదేవరాయ కవిరాజు. రాజకీయ రంగంలో, సాహితీ రంగంలో, ఎనలేని కీర్తి గడించిన కృష్ణదేవరాయలు భువనవిజయ సభా నిర్మాణం గావించి, సర్వకార్యకలాపాలూ అందులో సాగించేవాడు.

"భువన విజయాఖ్య సంసన్నవరత్న విభాప్రభాత నలినాప్త" అని ముక్కుతిమ్మన ప్రశంసించి యున్నాడు.

"కవితాప్రావీణ్య ఫణీశ" అనీ, "అవంధ్య ప్రబంధ కృతి నిర్మాత" అనీ, "సకలకళాధోరణి" అనీ తిమ్మన కీర్తించివున్నాడు.

అష్టదిగ్గజాలకేగాక సంస్కృత ద్రవిడకర్ణాటకవులకు గూడా భువన విజయ సభ ఆటపట్టు. ఇట్టి భువనవిజయసభా నిర్మాత అ…న ఈ రాజకవి ప్రబంధయుగానికి కర్త. అనేక ఉత్తమ కృతులకు కర్త. ఉత్తమోత్తమ కృతుల స్వీకర్త.

## రాయలకు పూర్వం రాజకీయ సారస్వతిక పరిస్థితులు

దక్షిణ భారతదేశంలోనే గాక, ఉత్తర భారతంలో గూడా హిందూ రాజులే పరిపాలిస్తూ వుండేవారు. రాచరికం అంటే పెత్తనమూ, వైభవాలూ, భోగాలూ అధికం గాబట్టి ఆ భోగాలు తమకూ గావాలని ఆ యా రాజుల వారసులూ, ఇతర ప్రాంత రాజులూ అభిలషించేవారు. అందుకోసం దండయాత్రలూ, కుట్రలూ, హత్యలూ జరుగుతూ వుండేవి. దేశమంతా ఏనాడూ ఒకే పాలన క్రింద వుండేది గాదు.

క్రీస్తు తర్వాత పదవ శతాబ్దం నుండి మహమ్మదీయ ధండయాత్రలు సాగడం మొదలయ్యాయి. మొదట అవి చాలావరకూ ఉత్తరభారతం వరకే పరిమిత మయ్యాయి,

మహమ్మద్ గజనీ ఎన్నోసార్లు దండయాత్రలు సాగించి, కేవలం ధనకనక వస్తువాహనాలతో వెళ్ళిపోతూ వుండేవాడు. ఎంతోమందిని చంపేవాడు. ముఖ్యంగా దేవాలయాలు దోచే వాడు. దేశం అంతా అశాంతిమయం. పదమూడవ శతాబ్దం నుండి ఘోరీ దండయాత్రలు ప్రారంభమయ్యాయి. వారూ, వారి వారసులూ, దేశాన్ని ఆక్రమించి పాలించడం మొదలు పెట్టారు. మతాన్ని వెలయించ మొదలుపెట్టారు.

ఆ సమయంలో దక్షిణ భారతంలో గూడా హిందూ రాజులు పరిపాలిస్తూ వుండేవారు. ఆంధ్రరాజ్యంతో పాటు, చేర, చోళ, పాండ్య రాజ్యాలుండేవి. వీళ్ళల్లో వీళ్ళు యెప్పుడూ కయ్యాలలో మునిగి వుండేవారు. ఈ సమయంలో విజయ నగర ప్రతిష్ఠాపన జరిగింది. అది దక్షిణదేశ రాజకీయ కార్య కలాపాలకు కేంద్రం అయింది.

ఇదే సమయంలో మహమ్మదీయ రాజులు దక్షిణ హిందూ దేశాన్ని గూడా జయించాలని దండయాత్రలు సాగించారు. 1297 ప్రాంతంలో ఢిల్లీ నవాబు దగ్గరబంధువు అల్లాఉద్దీన్ ఖిల్జీ దేవగిరిపై పడ్డాడు. ఊచకోత కోశాడు. 1297 లోనే గుజరాత్‌ను ముట్టడించి ధ్వంసం చేశాడు. అపారధన రాసులు ఢిల్లీకి మోసుకు పోయాడు.

1303 లో మాలిక్ కాఫర్ వరంగల్లు ముట్టడించాడు. రాజులను వోడించి, నానా బీభత్సం చేసి ఎంతో నష్టం కలి

గించాడు. 1310 లో హొయసల రాజ్య రాజధాని ద్వార సముద్రం ముట్టడించాడు. స్త్రీలను మానభంగం చేసింది సైన్యం. బాల వృద్ధు లనకుండా చిక్కిన వారినంతా చంపి వేసింది. చిక్కిన వారిని చంపడమో, మతం మార్చడమో నిత్యకృత్యంగా గల మాలిక్ కాఫర్, మలబార్ తీరంలో మాస్కును గూడా కట్టించాడు. అంటే చాలామందిని మతం మార్చాడన్న మాట. ఎందుకోగాని తర్వాత కొంత కాలంపాటు ఆగాయి దండయాత్రలు.

మళ్ళీ 1312 లో మొదలైంది దండయాత్ర. 1318లో ముబారక్ దేవగిరిని ముట్టడించాడు. దాని రాజయిన హరిపాల దేవుని పట్టుకొని సజీవంగా తోలు వొలిచి చంపి కోట గుమ్మానికి వ్రేలాడగట్టాడు. ఇంకా ఎన్నెన్నో దుర్మార్గాలు సాగించాడు. ఇలా సాగిస్తున్న భయంకర దండయాత్రల పర్యవసానంగా 1323 లో వరంగల్లు మహమ్మదీయుల వశమైపోయింది.

ఈ పాటికి ఉత్తర హిందూస్థానం అంతా మహమ్మదీయపాలన క్రిందికి వచ్చింది. దక్షిణాన్ని జయించాలన్న పట్టుదల ఇప్పుడు వారికి అధిక మయింది.

కృష్ణానదికి దక్షిణంగా వున్న దక్షిణ దేశమంతా హిందూరాజుల పాలన క్రింద వుంది. ఈ సమయంలో

అంటే 1325 ప్రాంతంలో ఢిల్లీ సింహాసనాన్ని తుఘ్లక్ అధిష్ఠించడంతో దేశం యొక్క అపాయ స్థితి పరాకాష్ఠను అందుకొంది.

తుఘ్లక్ గుజరాత్‌ను ఓడించి దక్షిణంగా పయనించి తుంగభద్ర ఉత్తరగట్టున వున్న ఆనెగొంది చేరుకున్నాడు. ఆ సైన్యం దెబ్బకు ఆనెగొంది రాజు భయపడి పోయాడు. ఆ రాజును సకుటుంబంగా తుఘ్లక్ హతమార్చాడు. మతం మార్చి హరిహరుడనే సేనాపతిని తాత్కాలికంగా రాజుగా నియమించి వెళ్ళిపోయాడు.

ఈ హరిహరరాయలు విద్యారణ్య స్వామి ప్రోత్సాహంతో తుంగభద్ర దక్షిణపు గట్టున విజయనగర ప్రతిష్ఠాపన చేసి హిందూ రాజ్యాన్ని విస్తరింప జేయసాగాడు. హరిహర రాయల పాలన ఎట్లా అంతరించిందోగానీ (బహుశః చంపబడివుంటాడు) అతని తమ్ముడు బుక్కరాయలు రాజై ముప్ఫయియేడేండ్లు రాజ్యం చేశాడు. ఇతడు సైన్యాన్ని బాగా పెంచాడు. ఇతర హిందూ మండలాధిపతులు ఇతణ్ణి గౌరవించారు. తర్వాత రాజయిన హరిహరరాయలు మహామండలేశ్వరుడని మాత్రమే అనిపించుకొన్నాడు గాని తర్వాతి రాజయిన రెండవ హరిహరరాయలు మాత్రమే రాజాధిరాజు అనిపించుకున్నాడు.

ఇపుడు తుఘ్లక్‌కు దక్షిణాన దేవగిరి మాత్రమే మిగిలింది. తుంగభద్ర దక్షిణాన విజయనగర రాజుల బలం ఎక్కువగా వుంది. దేవగిరికీ, విజయనగరానికీ మధ్యవున్న ప్రాంతం అంతా అరాచకంగా వుంది. ఈ సమయంలో అల్లా ఉద్దీన్‌బహమనీ, గుల్బర్గా రాజయ్యాడు. ఇది కొత్తరాజవంశం. దీని రాచరికం దాదాపు 150 యేండ్లు, అనగా 1470 వరకూ సాగింది. ఈ వంశంతో హిందూ రాజులకు నిత్యపోరాటం అయింది.

గుల్బర్గా పాలకుడు దండయాత్ర చేశాడు. బుక్క రాయలు ఎదిరించాడు. ఎన్నో వేల సైన్యం వున్న బుక్క రాయల విడిదిని చూచి నవాబు భయపడ్డాడు. కొన్నాళ్ళు ఈ వైరి శిబిరాలు ఒకదాని కొకటి అభిముఖంగా కృష్ణాతీరాన విడిది చేశాయి. బుక్కరాయలు బాగా తాగి మదవతులతో గూడి రసలోలుడై ఆదమరచి వున్న సమయంలో మహమ్మదీయ సైన్యం హఠాత్తుగా పడి చావుదెబ్బ కొట్టింది. సైన్యాన్నీ సామాన్య ప్రజలనూ చిత్రవధ చేసింది. హిందూస్త్రీల మాన ధనాన్ని హరించింది. రెండు లక్షలమంది హిందువులు చచ్చి పోయారు. ఆఖరికి ఎంతో డబ్బు సమర్పించి సంధి చేసుకున్నాడు బుక్కరాయలు.

1375 లో గుల్బర్గా పాలకుడు మహమ్మద్ చనిపోగా అతని కొడుకు ముజహర్ రాజయ్యాడు. తుంగభద్రకూ, కృష్ణకూ మధ్యన గల భూములను వదలిపెట్టవలెనని బుక్క-రాయలకు కబురంపాడు. రాయలు ఒప్పుకోలేదు. నవాబు దండెత్తి బుక్కరాయలను తరుముకుంటూ రామేశ్వరం వరకూ వచ్చాడు. ఎలాగో తలదాచుకుంటూ బుక్కరాయలు మళ్ళీ విజయనగరం చేరాడు. సైన్యాన్ని సమకూర్చుకొని కాచుకొని వుండి, గుల్బర్గాకు తిరిగి వస్తున్న ముజహిద్‌ను అడ్డగించి ఓడించాడు.

ముజహిద్ మేనల్లుడు దావూద్ బలవంతుడై రాజును (ముజహిద్) చంపి తాను రాజయ్యాడు. ఒక నెల లోగానే అతన్ని చంపేసి అతని కుమారుడి కండ్లు పీకించి సింహాసనానికి అనర్హుణ్ణి చేసింది ముజహిద్ సోదరి. తర్వాత అల్లా ఉద్దీన్ ఆఖరి కుమారుడు ఒకటవ మహమ్మద్ రాజై యిరవై యేండ్లు ప్రశాంత పాలన సాగించాడు.

బుక్కరాయల అనంతరం రెండవ హరిహర రాయలు రాజయ్యాడు. ఇతడు బలవంతుడు. దక్షిణాదిన హిందూ రాజులను జయించి సామంతుల జేసికొని, మహమ్మదీయుల నెదిరించడానికి ఎంతెంతో సైన్యాన్ని కూర్చుకున్నాడు.

మైసూరు, ధార్వార్, కంజీవరం, చంగల్‌పట్టు, తిరిచిరాపల్లి మొదలయిన చోట్ల విజయస్తంభాలు నాటించి శాసనాలు వ్రాయించాడు. మహారాజాధిరాజు అని బిరుదు పొందాడు. అయితే భోగలాలసతను విడలేకపోయాడు.

గుల్బర్గాలో అశాంతి. వారసుల కళ్ళు పీకేసి రాజ్యానికి అనర్హత కలిగించడం అధికమయింది. ఆ విధంగా యిద్దరు అయ్యాక దావూద్ ఆఖరి కుమారుడు ఫిరోజ్‌షా రాజయ్యాడు. ఏ రాజ్యానికి ఎవరు రాజయినా గుల్బర్గా విజయనగరాల మధ్య వైరం ననలు వేస్తూనేవుంది.

ఇపుడు ఫిరోజ్ విజయనగరంపై దండయాత్ర చేశాడు. రాయలు మహాభోగలాలసుడై నగళ్ళలో రసానందంలో వున్నాడు. ఫిరోజ్‌షా సేనాధిపతి మాయోపాయం చేసి, మాయా వేషంలో రాజవేశ్యతో పాటు రాజనగళ్ళలో ప్రవేశించాడు. సైనికులు గూడా మారువేషాలతో ప్రవేశించారు. గానా, పీనా, బజాన సమయంలో తటాలున దీపాలు ఆర్పి రాజును చంపి, ఆడా మగా పిల్లా పెద్దా అనకుండా హింసాకాండ జరిపారు. రాయలకుమారుడు మొదటి దేవరాయలు సంధి చేసుకున్నాడు.ఆ సంధి ముఖ్యషరతు రాజకుమారిని ఫిరోజ్‌షా కీయడం. వివాహం బ్రహ్మాండంగా జరిపించారు. ఎదురుకోలులో ఆరుమైళ్ళ పొడవున మఖమల్ బట్టలు అడుగులకు

మడుగు లైనాయి. నవాబుపై బంగారుపూలు జల్లారు. సంధి ఫలంగా ఎవరి ప్రాంతాలు వారివిగా ఒడంబడిక జరిగింది.

ఒకవైపు సంధి చేసుకుంటూ వుంటారు. మరొకవైపు దండయాత్రలకు సిద్ధమవుతూనే వుంటారు. ఒకరిపక్షంలోని వారికి మరొకపక్షంలోని వారు లంచాలిచ్చి చంపించే అలవాటు ఇటు హిందూ రాజుల్లోనూ, అటు మహమ్మదీయ రాజుల్లోనూ వుంది.

మహా అందగత్తె అయిన ఒక రైతు కుమార్తె కోసం దేవరాయలు దండెత్తిపోయాడు. ఆ ప్రాంతం ఫిరోజ్‌షా అధీనం లోనిది. అది తెలిసి ఫిరోజ్‌షా ఎదిరించి అతనిని ఓడించాడు. ఆ అందగత్తెను తెచ్చి తన కుమారుడు హసన్ కిచ్చి పెళ్ళి చేశాడు.

దేవరాయలు మహమ్మదీయ సైన్యాన్ని ఓడించిన దశలో, వాళ్ళకంటే గూడా కసిగా తురక సైన్యాన్ని ఉత్తిరించడమే గాక, సామాన్య జనులను చంపడమూ, మహమ్మదీయ స్త్రీలను మానభంగం చెయ్యడమూ, గుర్రాలను గూడా చంపడమూ జరిగేది. పగఅంటే అంతే. వివక్ష వుండదు. ఆ రోజుల్లోని హిందూ మహమ్మదీయ శత్రుత్వాలు అటువంటివి. రాజ్యకాంక్షా, మతస్పర్థా అటువంటివి.

మహారాజాధిరాజ రాజపరమేశ్వర బిరుదాంకితుడైన రెండవ దేవరాయల అనంతరం పాలించిన రాజులు బలవంతులు కారు. ఒకరిని చంపి మరొకరు రాజు కావడానికి కుట్రలు పన్నినవారు.

మల్లికార్జున రాయలు, మొదటి విరూపాక్షరాయలు, రెండవ విరూపాక్ష రాయలు, రాజశేఖర రాయలు ఈవిధంగా రాజులయిన వారే. ఈ సమయంలో ఇటు దక్షిణ హిందూ రాజ్యాలలోనూ, అటు గుల్బర్గాప్రాంత నవాబుల పాలనలోనూ గొప్ప గొప్ప మార్పులు వచ్చాయి.

హిందూ పాలకులు చాలా బలవంతులు కావడంతో హిందూ మండలేశ్వరు లందరూ స్వతంత్రతను ప్రకటించు కొన్నారు. ఆ విధంగా స్వతంత్రుడై, తర్వాత విజయనగర రాజై, మహాబలవంతు డయిన వాడు సాళువ నరసింహ రాయలు. సంగమవంశ పాలన అంతం కాగానే సాళువ నరసింహ రాయలతో సాళువ వంశం పాలనా రంగంలో అడుగిడింది.

విరూపాక్షరాయలు బలహీనుడు, రసలోలుడు. కేవలం స్త్రీలోలుడు. సాళువ నరసింహ నాయకుడు దండెత్తి వచ్చి రాజనగళ్ళు ప్రవేశిస్తూ వుంటే అడ్డేవాడే లేకుండా పోయాడు. ప్రవేశించిన నరసింహనాయకుడు రాజును చంపి అక్కడున్న స్త్రీలను గూడా చంపి, చుట్టుపట్ల వున్న కావలి వారిని గూడా

చంపేసి సింహాసనం స్వాధీనం చేసుకున్నాడు. సాళువ నరసింహ నాయకుడు చాలా బలవంతుడు. అందువల్ల ముస్లిం దండయాత్రలు గూడా ఆగిపోయాయి కొంతకాలం.

దక్షిణ దేశ హిందూ రాజ్యాలన్నీ యిపుడు సాళువ నరసింహ నాయకుడి క్రింద ఏకం కాజొచ్చాయి. నరసింహ రాయలు దండయాత్ర చేసి ముద్గల్లు, రాయచూరు మహమ్మదీయుల నుండి లాక్కున్నాడు.

ఈ సమయంలో విదేశీయులు గూడా హిందూ దేశం ప్రవేశించారు. వాస్కోడిగామా పోర్చుగీసు రాజు అనుమతితో బయలుదేరి వచ్చి 26-8-1498 లో కాలికట్ వద్ద దిగాడు. ఆ ప్రాంతంలో వ్యాపార కేంద్రాలు స్థాపించారు, పోర్చుగీసు వారు. కాలికట్ రాజుకూ, వారికీ సరిపడకపోయే సరికి 1500 ప్రాంతంలో పోర్చుగీసు రాజు తన సైన్యాన్ని పంపాడు. గోవా ప్రాంతంలో యుద్ధం జరిగింది. కొచ్చిన్‌లో ఫ్యాక్టరీని కట్టారు. కాలికట్ రాజు మంచిగా వున్నప్పటికీ ఈ పోర్చుగీసు వారు దుండగాలు చేస్తూనే వున్నారు. వారికి చేతిదురద యెక్కువ. ఎవరో ఒకర్ని నరకడం అంటే వారికి సరదా. మొత్తానికి కొచ్చిన్, కాలికట్, గోవాలలో వారి స్థావరాలు బలపడ్డాయి. వారికి దేశంలో స్థిరవాసం యేర్పడింది. ఆల్ఫోంసో ఆల్‌బుకర్క్ పోర్చుగీసు గవర్నరయ్యాడు.

ఇపుడు గుల్బర్గా ప్రాంతంలో చాలా మార్పులు వచ్చాయి. బహమనీ రాజ్యం అయిదు భాగాలుగా చీలిపోయింది. బీజాపుర ఆదిక్‌షాహీలు గానూ, బీదరు బరీద్‌షాహీలుగానూ, బీరార్ ఇమద్‌షాహీలుగానూ, అహమ్మద్ నగర్ నిజాంషాహీలు గానూ, గోల్కొండ కుతుబ్‌షాహీలుగానూ చీలి పోయారు. వీళ్ళల్లో వీళ్ళు నిత్యమూ పోట్లాడుకొనేవారు. క్రూరంగా హింసించుకొనేవారు. ఆంధ్రరాజులకు వీరందరూ శత్రువులే. అయితే వీళ్ళందర్నీ కలవనీయని రాజనీతితో విజయ నగరాంధ్ర రాజులు ప్రవర్తిస్తూ వుండేవారు. ఒక్కొక్కరిపై పడి చాలా బీభత్సం చేసేవారు. మానభంగాలు చేసేవారు. ఆంధ్రులు చిక్కినపుడు మహమ్మదీయులూ అంతే చేసేవారు.

## నాటి సామాజిక పరిస్థితులు

హిందూ శబ్దం జాతివాచకమే గాని మతం గాదు. సింధు, హిందూ అయింది. ఆ ప్రాంతాన్ని హిందూ దేశం అన్నారు. క్రమేణా భారతదేశాని కంతా అది వర్తించింది. హిందు అన్నది కేవలం దేశనామం, జాతినామం అవుతుందే గాని మతనామం గాదు.

మతశబ్ద నిర్వచనానికి హిందూ శబ్దం లొంగదు. మతం అనగానే సమత్వం అన్నది మొదటి గుణం. మనం కులాలుగా శాఖలుగా, అంతశ్శాఖలుగా చీలిపోయాం. ఆఖరికి యీ మానవుల్లో అమానుషమయిన అంటారానితనం గూడా వుంది. ఇవన్నీ యిలాగే వుండాలని రాజశాసనాలు గూడా వున్నాయి.

ఇక రెండవ గుణం: ప్రచారగుణం గలిగి మత మార్పిడి ముఖ్యాంశంగా వుండాలి. అది మనకు లేదు. ఇదే మన ఆదర్శంగా వుండి వుంటే మనదేశంలోకి అన్యమతం ప్రవేశించేది గాదు. ప్రవేశించినా ఇందులో లీనం అయిపోయి వుండేది. సంఖ్యాబలం హిందూ జాతిదే గాబట్టి, పాలనాధికారం గూడా వుంది గాబట్టి, వచ్చిన అల్ప సంఖ్యాకులను తమ మతంలోకి మార్చగలిగి వుండేవారు. అలా జరగలేదు. ఆ అన్యమతస్థులు అత్యల్ప సంఖ్యలోని వారే అయినా అధిక సంఖ్యాకు లయిన హిందూ దేశవాసులను తమ మతంలోకి చేర్చుకొని సంఖ్యాబలాన్ని ఘనంగా రూపొందించుకున్నారు. మతరీత్యా శత్రువులై పోయారు. ఈనాడు అర్థం తెలియకుండా వీరావేశంతో హిందూమతం, హిందూమతం అని కేక లేస్తున్నారుగదా, అది మతమే అయివుంటే ఈనాడింతమంది అన్యమతస్థులుండేవారా? పాకిస్తాన్, బంగ్లాదేశ్, భారత దేశాల్లోవున్న ముస్లిము

లంతా 1947 కు పూర్వం భారతీయులేగదా! అంతా యిందు లోనుండి గత శతాబ్దాలలో మతం మార్పిడివల్ల కలిగిన వారే గదా. పదమూడవ శతాబ్దంలో ఏ కొద్దిమందో వచ్చి స్థిరపడిన ముస్లిములు, ఇక్కడి రాజులను హోడించి భయపెట్టి కొందరినీ, తమ సమతా ప్రదర్శనతో చాలామందినీ మతంలోకి మార్చుకున్నారు. ఆ సమయాల్లోని హిందూరాజులు కసిగా వారిపైబడి బలంవుంటే వాళ్ళను చంపి, మానభంగాలు చేసి వదిలారేగాని హిందువులను ముస్లిములు చేసినట్లుగా, వారిని ఈ హిందుమతంలోకి మార్చగలిగారా? లేదు. ఎందుకు, ఇది మతం గాదు గాబట్టి. ఆ దృష్టే వీరికి లేదు గాబట్టి. వీరిని పురికొల్పుతున్న బ్రాహ్మణ గురువులూ, బ్రాహ్మణ మంత్రులూ ఆ దృష్టితో ఆలోచించలేదు గాబట్టి. ఇక మహమ్మదీయ మత గురువులుగానీ, రాజులుగానీ మతంమార్పిడే వారి ఏకైక దృష్టి. కసిగా శత్రువులను చంపినా, ఓడిపోయిన హిందు-రాజుల భార్యాబిడ్డలను పెండ్లి చేసుకొనేవారు. ఇతరహిందూ స్త్రీలను పెండ్లాడేవారు. బలహీనులనూ, హిందువులు అతి నీచంగా చూచే హరిజనులనూ, వెనుకబడిన కులాలవారినీ సమతా పద్ధతిలో మతం మార్పిడి కావించి, సమదృష్టితో చూచేసరికి, ఈవిధంగా కొత్తగా మతం పుచ్చుకున్నవారు తమనిదివరలో హీనంగా చూచిన ఈ కులవ్యవస్థా హిందువులను క్రూరంగా, నీచంగా చూచారనడంలో సందేహంగానీ, తప్పుగానీ లేదు

గదా : అదీ, ఆనాడూ ఈనాడూ గల మత విద్వేషాలకు మూల కారణం. లేకపోతే ఆ శతాబ్దాల్లో వచ్చిన ముస్లిము లెంతమంది ? ఆ తర్వాత అయినా వచ్చిన వారెంతమంది ? వారూ, వారి సంతతివారూ మాత్రమే ముస్లిం మతస్థులు అయి వుంటే ఈనాటికి దేశమంతా కొన్ని వేలసంఖ్యలో మాత్రమే వుండేవారు. కాని ఇన్నిన్ని కోట్ల జనసంఖ్య యెలా పెరిగింది ?

నాల్గవ గుణం:వివాహాది క్రతువులూ,మృతదేహ సంస్కారాలూ అన్నికులాలకూ ఒకటి గాదు. ప్రాంత ప్రాంతాలకూ భేదం వుంది. పురోహితులు ఈ భేదాలు అధికం చేశారే గాని, ఏకత్వాన్ని కలలో కూడా రాకుండా చేశారు. ఈనాడు ఒకే ప్రాంతంలో, అంతేగాదు ఒకే గ్రామంలో వున్న నూరు ఇండ్లూ నూరు కులాలు. శుభాశుభకార్యాలు ఆ గ్రామానికయినా ఒకే రూపంలో వుండవు. ఇంత అనంతగా – విద్య వచ్చిన యీ రోజుల్లో గూడా – అనేకత్వం కనిపిస్తున్న దంటే, విద్యరాని ఆ రోజుల్లో – స్త్రీ శూద్రుల కలుపుకొని కనీసం 95 శాతానికి విద్య నిరాకరింపబడిన రోజుల్లో – యెల్లావుండేదో సులభంగా వూహించుకోవచ్చు.

సామాజిక, సాంస్కృతిక సమత్వమే ఆ రోజుల్లో వుండి వుంటే యుద్ధాల నష్టాలు గూడా అంతగా వుండి వుండేవి గావు. హిందూ మహమ్మదీయ రాజుల రాజ్య విస్తరణకాంక్షా,

అధికార స్వార్థమూ ముఖ్యకారణాలుగా యుద్ధాలు జరిగినా, కసితో, ద్వేషంతో మానభంగాలూ, సామాన్య జన హననాలూ అంత తీవ్రంగా పుండి వుండేవి గావు. ఆనాడు గానీ, యీనాడు గానీ, భారతదేశంలో మత విద్వేషాలున్నాయంటే కేవలం మన కులవ్యవస్థ కారణం. కులవ్యవస్థే లేకుండా వుండి వుంటే, మతమేవుండి వుంటే- ఈనాటి విద్వేషాలకు స్థానం వుండేది కాదు.

ఇంతేగాదు ఇంకా యెన్నో కారణాలు పురస్కరించుకొని "మనది మతంగాదు", కేవలం కులవ్యవస్థే అని తేలింది. ఇతరదేశాల్లో లేని మతవిద్వేషాలు మన దేశంలోనే హిందూ మహమ్మదీయుల మధ్య ప్రతిచోటా యెందుకున్నాయో తేలిపోయింది. ఈ కుల వ్యవస్థ తొలగిన నాడే బహు అభిప్రాయాలకు చోటు లేని ఏకాభిప్రాయం గలిగిన మత వ్యవస్థ నెలకొనగలదు. అపుడు మత విద్వేషాలు అంతరించగలవు.

ఆ రోజులలో ముఖ్యంగా, కృష్ణదేవరాయలు రాజ్యానికి రాకముందు రోజులలో, సాంఘిక పరిస్థితులు చాలా హీన స్థితిలో వుండేవి. కులవ్యవస్థ కఠినరూపంలో వుండేది. గ్రామాల్లో ప్రజానీకం కులరీత్యా వేరయినా, సార్వజనికమైన బీదతనం వల్ల ఒక మోస్తరు ఏకత్వాన్ని పాటించేవారు.

అన్యోన్య వివాహసంబంధా లుండేవి గావు. "చాతుర్వర్ణ్య రక్షణాచార్య" అన్న బిరుదాల గర్వంతో పరిపాలకులు జనాన్ని కలవనిచ్చేవారు గారు. అంతకు పూర్వం ఎన్నో శతాబ్దాలుగా పాలిస్తూ వచ్చిన రాజులంతా శూద్రులే అయినా బ్రాహ్మణ గురువులు వారిని క్షత్రియులుగా మార్చివేసే వారు. మొదట విజయ నగర రాజ్య ప్రతిష్ఠాపకు లయిన హరి హరుడూ, బుక్కరాయలూ కురువ వంశంవారు. సాళువ నరసింహ నాయకాదులు యాదవులు. శివాజీ గూడా శూద్రుడు.

ఆ కొత్త క్షత్రియత్వంతో ఆ రాజులు చాతుర్వర్ణ్య వ్యవస్థను పటిష్ఠంగా కొనసాగించే వారు. ప్రజానీకాన్ని పిండి, తాము మాత్రం భోగ లాలసత్వంలో వుండేవారు. కంటికి బాగా కనిపించిన ఏ అందగత్తెను గూడా పొందకుండా వుండేవారు గాదు. ఖజానాల్లో డబ్బు తక్కువయితే ప్రజలపైన వచ్చిపడే వారు. ఆ సమయాల్లో ప్రజలను ఎంతో హింసించేవారు. యుద్ధ సమయాల్లో వారి సైన్యం నడిచిన దార్లలో జనం ఎంత తల్లడిల్లేవారో, ఎంత అరాచక పరిస్థితులలో పడేవారో వర్ణనా తీతం. సామాన్య జనం అంతా మొలకు కాస్త చిన్నబట్టతో వుండేవారు. యుద్ధాలలో సైనిక శిక్షణ పొందిన వారినే గాక మామూలు జనాన్ని గూడా నడిపించేవారు. ఈ అశిక్షితజనం

ముందు మునములో వుండి, శత్రువులు చేసే మొదటి దాడిలో హతమయ్యే వారు. అప్పుడు సుశిక్షిత సైనికులు వ్యూహాలు పన్ని శత్రురాజులపై పడేవారు. యుద్ధాల వల్ల అపారజన నష్టం వాటిల్లేది. ధనధాన్య రూప సంపదకు నష్టం వాటిల్లేది.

చరిత్రకు ఆధారాలు మనకు తక్కువ. కవుల కావ్యాల్లో ప్రతిబింబించే విషయాలు పాక్షిక సత్యాలు. అత్యంతమైన అతిశయోక్తులు. పాశ్చాత్య చరిత్ర కారుల వ్రాతల వల్ల మనకు కొంతకు కొంత సాంఘిక రాజకీయ సాంస్కృతిక జీవన విధానాలు తెలుస్తున్నాయి.

విజయనగర రాజుల వద్ద వందల కొలదీ యేనుగులూ, వేల కొలదీ ఆశ్వికదళమూ, లక్షల కొలదీ పదాతి సైన్యమూ వుండేదని న్యూనిజ్, నికొటిన్, ఫెరిస్తా, నికోలోకాంట్, పేయాస్, అబ్దుల్ రాజాక్ మొదలయిన విదేశీయ చరిత్రకారులు వ్రాశారు.

రాయలకు ముందే విజయ నగర సైన్యం 10 లక్షలనీ, పదకొండు లక్షలనీ చాలా మంది వ్రాశారు. గుల్బర్గాలో మహమ్మదీయ సైన్యం గూడా 9 లక్షల పదాతి దళం వుండేదనీ, దాదాపు రెండు లక్షల ఆశ్వికదళం వుండేదనీ వ్రాశారు.

అటు గుల్బర్గా మహమ్మదీయ పాలకుల దగ్గర వుండే సైన్యం కేవలం ముస్లిములు అనడం తప్పు. అలాగే విజయ నగరాది హిందూ రాజుల సైన్యంలో అంతా హిందువులే అనడానికి వీలు లేదు. ముఖ్యంగా మహమ్మదీయులు సేనలో ఎనలేని సంఖ్యలో హిందూ సైన్యాధికారులూ, సైనికులూ వుండే వారు. ఆంధ్రరాజుల సైన్యంలో గూడా కొద్ది మంది మహమ్మదీయు లుండే వారు.

హిందూ సైన్యంలో కాళ్ళకు చెప్పులు లేని దిగంబర సైన్యం (మొలకు మాత్రమే చిన్నబట్ట) ఎక్కువగా వుండేదని చరిత్రకారులు వ్రాశారు.

పాలకులు యుద్ధాలకు వెళ్ళేటప్పుడు తమతో పాటు రాణులనూ, సామంతులనూ వందల కొలదీ వేరే ఆడువారినీ తీసుకొని వెళ్ళేవారు. వేటకు పోయేటప్పుడు గూడా మంత్రులూ, సామంతులతో పాటు ఎక్కువ మంది విలాసినీ జనాన్ని తీసుకు వేళ్ళేవారు. ఎన్ని భోగాలో! ఎన్ని వైభవాలో! సామాన్య జనజీవితం మాత్రం దుర్భరంగా వుండేదన్నారు చరిత్ర కారులు.

## మతం

రాయల కాలంలోనూ, అంతకు ముందు కూడా శైవ వైష్ణవ మతాలుండేవి. మళ్ళీ ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతాలుండేవి. అవి సాంఘికాలు కాకుండా, సమత్వంపై ఆధారపడకుండా వుండేవి. వైష్ణవులయినా, శైవులయినా అందులో కులభేదా లుండేవి. తర్వాత యేర్పడ్డ సిక్కు మతంలో గూడా అంతే. కుల సమత్వం లేకపోతే మతం పెరగదు గదా!

ఆ రోజులలో ముఖ్యంగా మూడు మతాలుండేవి. మహమ్మదీయ మతం, క్రైస్తవ మతం, హిందూ మతం. వీటిల్లో పరస్పర కలహాలు అధికం. కొత్తగా వచ్చిన క్రైస్తవ మతం గూడా తక్కువ క్రూరత్వాన్ని ప్రదర్శించ లేదు. పోర్చుగీసువారు కాలికట్, గోవా, కొచ్చిన్ మొదలయిన ప్రాంతాల్లో ఎంత మందిని చిత్రవధ చేశారో లెక్కలేదు. అయితే అటు హిందూ రాజులతోనూ, ఇటు మహమ్మదీయ సుల్తానులతోనూ వ్యాపారరీత్యా సఖ్యంగా వుంటూనే, సైనిక ఒడంబడికలు చేసుకుంటూ వుండేవారు. చర్చిలు నిర్మాణం చేసి మతాన్ని వెలయించే వారు. ఎక్కువగా ప్రబోధం చేతనే మతాన్ని వెలయించే వారు. ఆ విధంగా మతం మారిన వారంతా ఈ హిందూ సంఘంలోని వారే. ఈ కుల వ్యవస్థ

లోని హిందువులు, అటు మహమ్మదీయ మతంలోకీ, ఇటు క్రైస్తవ మతంలోకీ మారిపోతూ వుంటే అడ్డేవారెవరు? మనది గూడా మతమే అయివుంటే అడ్డకుండా వుండేవారా?

ఇక మహమ్మదీయులయితే, ప్రతి యుద్ధంలోనూ మతదృష్టిని ప్రదర్శించేవారు. హిందూ రాజులు ఓడిపోయి దొరికితే చిత్రవధ చేసేవారు. స్త్రీలను కసిగా మానభంగం చేసేవారు. ఏ వివక్షా లేకుండా చంపేసేవారు. బలాత్కారంగా మతంలో చేర్చుకునేవారు. అనేకంగా మసీదులు కట్టి మతాన్ని ఎక్కువగా పెంపొందించుకునేవారు. రోజు రోజుకూ మహమ్మదీయ మతంలోకి వేలకొలది జనాన్ని మతం మార్పిడి చేసేవారు.

హిందూ రాజులు మతదృష్టితోనే మహమ్మదీయులతో యుద్ధాలు చేసేవారు. తమ ప్రాంతాలనుండీ, ముఖ్యంగా దేశం నుండీ మహమ్మదీయులను తరమాలనే దీక్షతో యుద్ధాలు చేసేవారు. అంతేగాని అన్యమత మార్పిడి మూలంగా తరిగిపోతున్న తమ సంఖ్యాబలాన్ని తిరిగీ మత మార్పిడిద్వారా పెంపొందించుకొనేవారు గారు. వీరు చూస్తూ వుండగానే మహమ్మదీయ మతం సంఖ్యాబలంలో పెరుగుతున్నదంటే, ఆ పెరిగిన సంఖ్యంతా హిందువులు మహమ్మదీయమతం పుచ్చుకోడం వలనే గదా! హిందువులను మతం మార్పి

లోని హిందువులు, అటు మహమ్మదీయ మతంలోకీ, ఇటు క్రైస్తవ మతంలోకీ మారిపోతూ వుంటే అడ్డేవారెవరు? మనది గూడా మతమే అయివుంటే అడ్డకుండా వుండేవారా?

ఇక మహమ్మదీయులయితే, ప్రతి యుద్ధంలోనూ మతదృష్టిని ప్రదర్శించేవారు. హిందూ రాజులు ఓడిపోయి దొరికితే చిత్రవధ చేసేవారు. స్త్రీలను కసిగా మానభంగం చేసేవారు. ఏ వివక్షా లేకుండా చంపేసేవారు. బలాత్కారంగా మతంలో చేర్చుకునేవారు. అనేకంగా మసీదులు కట్టి మతాన్ని ఎక్కువగా పెంపొందించుకునేవారు. రోజు రోజుకూ మహమ్మదీయ మతంలోకి వేలకొలది జనాన్ని మతం మార్పిడి చేసేవారు.

హిందూ రాజులు మతదృష్టితోనే మహమ్మదీయులతో యుద్ధాలు చేసేవారు. తమ ప్రాంతాలనుండీ, ముఖ్యంగా దేశం నుండీ మహమ్మదీయులను తరమాలనే దీక్షతో యుద్ధాలు చేసేవారు. అంతేగాని అన్యమత మార్పిడి మూలంగా తరిగిపోతున్న తమ సంఖ్యాబలాన్ని తిరిగీ మత మార్పిడిద్వారా పెంపొందించుకొనేవారు గారు. వీరు చూస్తూ వుండగానే మహమ్మదీయ మతం సంఖ్యాబలంలో పెరుగుతున్నదంటే, ఆ పెరిగిన సంఖ్యంతా హిందువులు మహమ్మదీయమతం పుచ్చుకోడం వల్లనే గదా! హిందువులను మతం మార్చి

మహమ్మదీయులను చేసేస్తున్నారన్న కోపమూ,కసీ,ద్వేషాలతో యుద్ధాలు చేశారేగాని యుద్ధంలో చనిపోవడంద్వారానూ, ఓడిపోతే మహమ్మదీయ రాజులు ఓడినవారిని మతంమార్చి తమలో కలుపుకోవడంద్వారానూ హిందువుల సంఖ్యాబలం సన్నగిల్లుతున్నదన్న ఇంగితం హిందూ రాజులకూ లేదు. వారిని పురికొల్పుతున్న బ్రాహ్మణ గురువులకూ, మఠాధిపతులకూ అసలు ఆ దృష్టే లేదు. తమలోనే అస్పృశ్యత, కులభేదాలూ పాటించే నీచధోరణి గల యీ పెద్దలు అవతలి వారిని మ్లేచ్ఛులూ, కసాయివారూ అని నిందిస్తూ దూరం చేసుకున్నారేగాని నయాన్నో, భయాన్నో తమ మతంలో కలుపుకోవాలన్న ఆలోచన చేయలేదు. అంతకంతకూ శత్రు పక్షంలో మతం మార్పిడిద్వారా సంఖ్యాబలం పెరగడానికి పరోక్ష కారణభూతులుగా తయారయ్యారే గాని, తమ సంఖ్యా బలాన్ని పెంచుకొనే బుద్ధిమంతులు కాలేకపోయారు. కుల కట్టుబాట్లను పటిష్ఠం చెయ్యడానికి ఎన్నెన్నో ప్రయత్నాలు చేశారేగాని దానివల్ల జరుగుతున్న ఘోరాన్ని సాక్షాత్తుగా చూస్తూగూడా గుడ్డివారైపోయారు. ఈ కులవ్యవస్థే లేకపోతే మహమ్మదీయులు ఏ మాత్రంగూడా సంఖ్యాబలాన్ని పెంపొందించుకొనే వారే గాదు.

మఠాలు నిర్మించారు. దేవాలయాలు కట్టారు. కట్టి, అక్కడ గూడా కుల వివక్షతలు ప్రదర్శించి అంటరాని వారిని బయటపెట్టి, గ్రంథాలు వ్రాసి వాటిని ప్రచారంచేసి కులాన్నీ, కర్మసిద్ధాంతాన్నీ నిలబెట్టడానికే ప్రయత్నించారు గాని వర్తమానంలోనూ, భవిష్యత్తులోనూ గూడా తమ మతానికి జరగబోయే దారుణ నష్టాన్ని గుర్తించలేదు. తమ కాలంలోనూ, అంతకు ముందటి కాలంలోనూ, తమ ప్రాంతాలలోనూ, ఉత్తర హిందూస్థాన ప్రాంతాల్లోనూ గూడా ఈ కులవ్యవస్థే, ప్రజల్లో అన్యోన్యతనూ, పాలకుల్లో సమదృష్టినీ చంపేసి, అన్యమత దండ యాత్రలకు సుగమ మార్గం చూపిందన్న కనీసతర్కాన్ని గూడా వాళ్ళు విస్మరించారు. పరిపాలకుల నుండి తమకు సుఖజీవనమూ, గౌరవమూ, మఠాల రక్షణా, పీఠాలపెత్తనమూ చూచుకున్నారే గాని మహమ్మదీయులు విజృంభించి ముఖ్యంగా తమ బ్రాహ్మణులపైనా, రాజులపైనా బడి బలవంతంగా మత మార్పిడిచేస్తూ, మతాలకు ముప్పు కల్గిస్తూ వుంటే, చూస్తూ గూడా దూరదృష్టిని వహించకుండా తటస్థులుగా వుండిపోయారు. ఇదే అప్పుడూ ఆ తర్వాత గూడా దేశం అంతా మహమ్మదీయ పాలన క్రిందికి వచ్చి, నిరాఘాటంగా మహమ్మదీయ మతం వ్యాప్తి కావడానికి దోహదం అయింది. ఆ తర్వాత అదే యీ దేశాన్ని విభజించ

డానికి వీలయినంత సంఖ్యాబలాన్నీ కాఠిన్యాన్నీ పెంచుకొని దేశాన్నే విభజించే స్థితికి వస్తుందనే భవిష్యదృష్టి ఆనాడు కరువైంది. ఈనాడు గూడా బలహీనవర్గాలు సమత కోసమో, ఉన్నత జీవితం కోసమో, మహమ్మదీయ మతాన్నో, క్రైస్తవ మతాన్నో అవలంబిస్తూవుంటే, మతం మార్పిడి మాన్పించాలో అని కేకవేస్తున్నారేగాని, అది ఆగాలంటే మన సమాజంలోని కులభేదాలు నిర్మూలించి సమతాపద్ధతిలో మతంగా రూపొం దించి మతంమార్పిడికి ద్వారాలు తెరవాలనే కనీసబుద్ధి మన బుద్ధిమంతుల్లో లోపించింది. అదే జరిగితే ఇక మతం మార్పిడులూ వుండవు. మత వైషమ్యాలు కలికానికి గూడా వుండవు. ఎందుకంటే మనలో సమతాదృష్టి నెలకొంటుంది గాబట్టి సమత్వంకోసం ఇతర మతంలోకి మారనక్కరలేదు గాబట్టి.

## అప్పటి సాంస్కృతిక పరిస్థితులు

సంస్కృతి అంటే జాతిసర్వస్వం ప్రతిబింబించిన రూపం. సమాజం యొక్క రాజకీయ, సాంఘిక స్వరూపం, చరిత్ర, సారస్వతమూ, నాగరకత, కళలు అన్నీ పూర్వ ప్రస్తుత రూపాలలో ప్రతిబింబించేదే సంస్కృతి.

రాయలకు పూర్వం రాజకీయ మతరూపాల గురించి చర్చించుకున్నాం. ఇపుడు ఆనాటి సారస్వతమూ, తదితర కళలూ, గురించి తెలుసు కోవలసి వుంది.

ఆ రోజుల్లో దేవాలయ నిర్మాణం అధికంగా సాగింది. దేవాలయ శాసనాల్లో వాటికయ్యే ఖర్చుల కోసం భూములను దానం చేసినట్లు రాజశాసనా లున్నాయి. ఆ భూములకూ, ఇతర భూములకూ నీటిసరఫరాకోసం తుంగభద్రకే అనకట్ట కట్టారు. నగరంలో సైతం కాలువలు నిర్మించారు. ఆరామాలకూ, చెరకుతోటలకూ, వరి పొలాలకూ ఆ కాలువల నీరే. వరి, ఇతర ధాన్యాలూ, టెంకాయలూ, ఇతరఫలాలూ అధికంగా పండించేవారు. రైతులు పన్నులు చెల్లించేవారు.

ఎత్తయిన కోటలూ, కోటబురుజులూ, నాయకులకు రాతిగృహాలూ నిర్మించారు. వేదపాఠశాలలూ, తదితర బళ్ళూ స్థాపించారు. వేదవిద్యార్థులకు ఉచిత భోజన వసతులు కల్పించారు. ఆ వసతులు కేవలం బ్రాహ్మణులకే పరిమితం.

అటు గుల్బర్గా రాజులు గూడా మదరసాలు స్థాపించి మహమ్మదీయుల విద్యకు బాగా ప్రోత్సాహమిచ్చారు.

మహమ్మదీయులలో వున్నట్టే హిందువులలో గూడా బహు భార్యాత్వం వుండేది. రాజులలో ఇది మరీ విపరీతం. నికోలో అనే విదేశీయ చరిత్రకారుడు, మహారాజాధిరాజ

రాజపరమేశ్వర బిరుదాంకితుడు అయిన రెండవ దేవరాయల కాలంలోని సాంఘిక పరిస్థితులను గూర్చి వ్రాస్తూ "ఎంత మంది నంటే అంతమందిని పెండ్లి చేసుకొనేవారు. పురుషుడు చస్తే స్త్రీలు సహగమనం చేసేవారు. ఈ విషయంలో విజయ నగర రాజులు దేశంలోని ఇతర రాజుల తలదన్నేవారు. రాజుకు పన్నెండు వేల మంది భార్యలున్నారు. (వీళ్ళంతా భార్యలు కాకపోవచ్చు. అంతఃపుర దాసదాసీజనం అధిక భాగం గావచ్చు.) వీరిలో నాలుగు వేల మంది రాజు ఎక్కడికి పోతే అక్కడికి వెళ్ళాలి. వేటకు పోయినా సరే, అందరూ వంటశాలలో వుండాలి. ఈ స్త్రీలంతా గుర్రాలపై స్వారీ చేయగలరు. అందులో ముఖ్యులయిన స్త్రీలు రెండువేలమంది. రాజు చనిపోతే వారంతా సహగమనం చెయ్యాలి. అది ఆ రెండు వేల మందికి యివ్వబడిన ప్రత్యేక గౌరవం" అని వ్రాశాడు.

దేవదాసీలుండేవారు. ఆ రోజుల్లో ఎన్నో వందల మంది నిత్యమూ రాజనగళ్ళలో ఆటపాటలతో ఆనందింప జేస్తూ వుండేవారు. హోళీ, దసరా, దీపావళి వంటి పండ గలను చాలా సరదాగా చేసే వారు. వసంతోత్సవాలలో ఈ వేశ్యలంతా పాల్గొనేవారు.

దేవాలయ నిర్మాణంలో శిల్పులు చాలా స్పర్థతో పని చేసే వారు. ఎన్నో దేవాలయాల నిర్మాణం చెయ్యడం వల్ల అనేక మంది శిల్పులు నిత్యమూ పని చేస్తూ వుండే వారు. విజయనగరం, దేవరకొండ, వరంగల్లు, కొండవీడు, చంద్రగిరి, మధుర, రాజమండ్రి, కొండపల్లి, బెజవాడ, నెల్లూరు మొదలయిన అనేక నగరాల్లో దేవాలయాల స్థాపనా, సాహిత్యపోషణా, తదితర కళాపోషణా అధికంగా వుండేవి.

వరంగల్లులో సర్వజ్ఞ సింగన గొప్ప కళావేత్త. పోతన, పినవీరభద్రుడు ఆ ప్రాంతం వారే. నాచనసోమ నాథుడు, ఎర్రన, శ్రీనాథుడు, గోన బుద్ధారెడ్డి మొదలయిన వారు ఇతర అనేక సంస్థానాల్లో వుండే మహాకవులు.

కొండవీటి సంస్థానంలోని శ్రీనాథుడు కవితా దిగ్విజయం చేసిన మహాకవి. అతడు సర్వజ్ఞ సింగన ఆస్థానంలో మెప్పు బడసినాడు. ప్రౌఢదేవరాయల కాలంలో విజయనగరం వచ్చాడు. గౌడడిండిమభట్టు కంచుఢక్క పగుల గొట్టించాడు.

రెడ్డిరాజుల్లో స్వతహాగా కాటయవేముడు, అనవేముడు, కుమారగిరి, సంస్కృతంలో కవులు, విమర్శకారులు. కుమారగిరి ఆస్థానంలో మాచల్‌దేవి అనే వారాంగన మహా ప్రశస్తి నందిన నాట్యకత్తె.

ఇటు హిందూ రాజులు సాహితీసేవ చేసినట్లే అటు మహమ్మదీయ రాజులు గూడా సాహితీసేవ చేస్తూ వుండేవారు.

మహమ్మదీయ పాలన కింద, హిందూరాజుల పాలన కిందా వున్న ప్రాంతాల్లో చాలామంది కవులూ, తదితర కళా కారులూ చాలా కళాఖండాలను సృష్టించారు. నిత్యమూ కవితాగానాలూ, యక్షగానాది ప్రదర్శనలూ జరుగుతూ వుండేవి. ఇవన్నీ రాజుల వినోదార్థమే. పండితుల ప్రశంసార్థమే. సామాన్య జనజీవితం కావ్యాలలో ప్రతిబింబించడం గానీ, వారి ఉద్ధరణకోసం ఎలాంటి సాహితీ కృషి గానీ అంతగా జరిగేవి గావు.

## శ్రీ కృష్ణదేవరాయ మహారాయలు

బాల్యం : తుళువంశంలో ప్రసిద్ధుడు తిమ్మరాజు. ఆయనకు దేవకి అనే రాణివల్ల ఈశ్వరరాయలు కలిగాడు. ఇతడు గొప్ప వీరుడు. ఇతనికి బుక్కమ్మ అనే రాణివలన నరసానాయకుడు పుట్టాడు. ఈ నరసానాయకుడు సాళువ నరసింహరాయల కడ సైన్యాధిపతి. సాళువ నరసింహ రాయలు చనిపోయే సమయంలో విశ్వాసనీయుడైన తుళువ నరసానాయకునికి తన కుమారులయిన తిమ్మరాయ, తమ్మ

రాయల నిరువురినీ అప్పగించి, వారిలో యోగ్యునికి పట్టాభి షేకం చేయవలసిందిగా కోరి చనిపోయాడు. తుళువ నరసా నాయకుడు మొదట తిమ్మయను సింహాసనాధిష్ఠితుణ్ణి చేశాడు. అతనిని తన దాయాదులు విషప్రయోగంతో చంపగా అతని తమ్ముడైన తమ్మరాయనిని ఇమ్మడి నరసింహరాయలను పేరుతో రాజును చేశాడు. అతడు తుళువ నరసానాయకునికే ద్రోహం తలపెట్టగా వానిని చెఱసాలలో పెట్టించి తుళువ నరసానాయకుడే విజయనగర సామ్రాజ్యాధిపతి అయ్యాడు. అతని తర్వాత అతని కుమారుడు ఇమ్మడి నరసానాయకుడు [1503] వీరనరసింహరాయల పేరుతో రాజ్యానికి వచ్చాడు. [1505-1509] దేశంలో అల్లర్లు చెలరేగాయి. అప్పుడు వీర నరసింహ రాయలు విజయనగర రాజ్యరక్షణ కోసం తమ్ముడు అయిన శ్రీ కృష్ణదేవరాయలను ఉంచి, తాను ఉమ్మత్తూరు మొదలగు సంస్థానాలపై దండయాత్రకై వెడలిపోయాడు. వీర నరసింహరాయలు ఆ ప్రాంతాలలోనే చనిపోగా, 1509 లో రాజయిన శ్రీ కృష్ణదేవరాయలు యిరవైఒక్క సంవత్సరాలు రాజ్యం చేశాడు.

శ్రీ కృష్ణదేవరాయ జన్మ సంవత్సరం నిర్ధారణగా తెలియడం లేదు. ఆ రోజులలో షష్టిపూర్తులూ, సహస్రమాస జీవిత శాంతులూ లేవా? రాజులూ బ్రాహ్మణులూగూడా ఆ

రోజుల్లో ఇవి పాటించినట్లు కవులు గూడా వ్రాయలేదు. వారు వ్రాసుకోలేదు. అందుకే ఏ కవి జన్మదినం గూడా తాన వ్రాసిన గ్రంథాల్లో ఇదమిత్థంగా ఉటంకించ లేదు. పాశ్చాత చరిత్రకారులు, శాసనాల తేదీని బట్టి ఊహలు దాపలుగా నిర్ణ యించడం తప్ప వేరే సాక్ష్యాలు లేవు.

ఆ విధంగా న్యూనిజ్ మొదలయిన వారి వ్రాతల ననుస రించీ, శాసనాల లెక్కల ననుసరించీ, శ్రీ కృష్ణదేవరాయల జన్మ 1485 ప్రాంతం అవుతున్నది. ఏది ఏమయినా కృష్ణ దేవరాయలు వార్ధక్యం వచ్చే వరకూ జీవించలేదు.

రాయలు రంగు ఎరుపు అన్నారు చరిత్రకారులు. కొద్దిగా స్ఫోటకపు మచ్చలు, అంత ఎత్తూ పొట్టీ కాని ఆకారం. చిన్నప్పటి నుండి బాగా కసరత్ చేసిన శరీరం. గుర్రపుస్వారీ, వేటా ఆయన వినోదాలు. సంగీతం, ముఖ్యంగా వీణావాద్యం ఆయన ప్రాణం. కవితారచన, కవిసమ్మేళనాలు, నాటకాలూ ఆయనకు ప్రాణాధిక వ్యాపకాలు. రాజు కాగానే ఈ అన్ని కళలకూ అధిక ప్రోత్సాహం ఇచ్చాడు. తాను స్వయంగా గ్రంథకర్త, కృతిస్వీకర్త.

తిమ్మరుసు సలహాలూ, సాహాయ్యమూ కృష్ణరాయ లకు పెట్టనికోట. రాయలను రాజును చేసి రాజకీయ కార్యకలా పాలన్నీ మెలకువతో నడిపిస్తూ వచ్చిన మహామనీషి ఆయన.

రోజుల్లో ఇవి పాటించినట్లు కవులు గూడా వ్రాయలేదు. వారూ వ్రాసుకోలేదు. అందుకే ఏ కవి జన్మదినం గూడా తాను వ్రాసిన గ్రంథాల్లో ఇదమిత్థంగా ఉటంకించ లేదు. పాశ్చాత్య చరిత్రకారులు, శాసనాల తేదీని బట్టి ఊహలు దాపలుగా నిర్ణయించడం తప్ప వేరే సాక్ష్యాలు లేవు.

ఆ విధంగా న్యూనిజ్ మొదలయిన వారి వ్రాతల ననుసరించీ, శాసనాల లెక్కల ననుసరించీ, శ్రీ కృష్ణదేవరాయల జన్మ 1485 ప్రాంతం అవుతున్నది. ఏది ఏమయినా కృష్ణ దేవరాయలు వార్ధక్యం వచ్చే వరకూ జీవించలేదు.

రాయలు రంగు ఎరుపు అన్నారు చరిత్రకారులు. కొద్దిగా స్ఫోటకపు మచ్చలు, అంత ఎత్తూ పొట్టీ కాని ఆకారం. చిన్నప్పటి నుండి బాగా కసరత్ చేసిన శరీరం. గుర్రపుస్వారీ, వేటా ఆయన వినోదాలు. సంగీతం, ముఖ్యంగా వీణావాద్యం ఆయన ప్రాణం. కవితారచన, కవిసమ్మేళనాలు, నాటకాలూ ఆయనకు ప్రాణాధిక వ్యాపకాలు. రాజు కాగానే ఈ అన్ని కళలకూ అధిక ప్రోత్సాహం ఇచ్చాడు. తాను స్వయంగా గ్రంథకర్త, కృతిస్వీకర్త.

తిమ్మరుసు సలహాలూ, సాహాయ్యమూ కృష్ణరాయలకు పెట్టనికోట. రాయలను రాజును చేసి రాజకీయ కార్యకలాపాలన్నీ మెలకువతో నడిపిస్తూ వచ్చిన మహామనీషి ఆయన.

రాయలు ఒకవైపు యుద్ధాలు చేసి గెలుస్తూ వైరిరాజులను సామంతులుగా చేసుకుంటూ, జయస్తంభాలు నాటుతూ, మహమ్మదీయ సుల్తానులపైన దండెత్తుతూ, వారిని ఓడిస్తూ, మరోవైపు భువనవిజయం స్థాపించి రాజకీయ కార్యకలాపాలు ఒక యెత్తుగా, సర్వవిధ కళా సేవనాలు మరొక యెత్తుగా జీవితం సాగిస్తూ, వార్ధక్య బాధలకు లోను గాకుండా మధ్య వయస్సులోనే జీవితయాత్ర చాలించిన ధన్యజీవి.

రాయల తండ్రి తుళువ నరసానాయకుడు, మహా సేనాని. సాళువ నరసింహరాయల దగ్గర ఆయన నమ్మకమైన సేనా నాయకుడు. ఈ వంశానికి నాయకుడనే పేరే గాని రాయలు అనే పేరు లేదు. తుళువ నరసానాయకుడు విజయ నగర సిహాసనం అధిష్ఠించిన అనంతరమే ఆ వంశానికి రాయలు అన్న బిరుదు వచ్చింది.

## శ్రీకృష్ణదేవరాయలు - జైత్రయాత్ర

శ్రీకృష్ణ దేవరాయలు మహా యోధుడు, ప్రతిభాశాలి. తిమ్మరుసుమంత్రి మహామేధ ఆయనకు తోడునీడ.

రాయలు సింహాసన మధిష్ఠించు నాటికి చుట్టుపట్ల హిందూ రాజులు, మహమ్మదీయరాజులు తిరుగుబాటులు లేవ

దీశారు.రాయల తండ్రి నరసానాయకుడి కాలంలోనే ఈ తిరుగుబాటులు తీవ్రమయ్యాయి. అప్పటికే కొన్ని చోట్ల శ్రీకృష్ణదేవరాయలు యుద్ధాలు చేసి వున్నాడు.రాజు కాగానే దిగ్విజయ దీక్షితుడైనాడు, ఎనలేని సైన్యాన్ని సమకూర్చుకున్నాడు. కులమత భేదాలు గణించకుండా ఎందరినో ఆశ్విక దళంలోనూ, పదాతి దళంలోనూ చేర్చుకున్నాడు.

మొదటగా బీజాపురసుల్తాను ఆదిల్‌ఖానుని ఎదిరించి తరిమి కోవెలకొండ వద్ద చంపేశాడు.

ఆదిల్‌ఖానుని కుమారుడు గుల్బర్గాను జయించి బీదరుపై దండయాత్ర చేసి ఆ పాలకుడైన మహ్మద్‌షాహానును బంధించాడు. ఈ సమయంలో బెల్గాం పాలకుడు కృష్ణదేవరాయలను సహాయం అర్థించాడు. రాయలు బీజాపురంపై దండయాత్ర చేసి రాయచూరు ఆక్రమించి, గుల్బర్గాను గ్రహించి, బీదర్‌పై నడిచి మహ్మద్‌షాను విడిపించి, సింహాసనమందు ప్రతిష్ఠాపించి "యవనరాజ్య స్థాపనాచార్య" అన్న బిరుదును పొందాడు.

వెంటనే దక్షిణంగా దండయాత్ర సాగించి ఉమ్మత్తూరు, శివసముద్రం సాధించాడు. తర్వాత శ్రీరంగపట్టణాన్ని గెల్చాడు.

ఇక పూర్వ ఈశాన్య దిగ్విజయ యాత్రకు బయలు దేరాడు. ఇందులో ఎన్నో ప్రాంతాలు కళింగరాజుల వశంలో వున్నాయి.

దాదాపు 1513 లో ఈ యాత్ర బయలు దేరింది. మనుచరిత్రలో రాయలవారి విజయయాత్ర గూర్చి ఈ క్రింది పద్యం విశదీకరిస్తుంది. రాయలవారి ఉగ్రప్రతాపాగ్ని ఇలా విజృంభించింది.

"తొలదొల్త నుదయాద్రిశిల దాకి కెరలు నీ
యసి లోహమున వెచ్చనై జనించె
మఱి కొండవీ డెక్కి మార్కొని నలియైన
యల కసవాపాత్రు నంటి రాజె
నట సాగి జమ్మిలోయ బడి వేగ దహించె
గోన బిట్టేర్చె, గొట్టాన దగిలె,
గనకగిరి స్ఫూర్తి గరచె, గౌతమి గ్రాచె,
నవుల నాపొట్నూర రవులు కొనియె;
మాడెములు ప్రేల్చె, నొడ్డాది మసి యొనర్చె,
గటకపురి గాల్చె గజరాజు గలగి పఱవ
దోక చిచ్చన, నౌర నీ దురవగాహ
ఖేలదుగ్రప్రతాపాగ్ని కృష్ణరాయ."

ఆ. 1-36

(పై పద్యం మనుచరిత్ర లోనిది. ఆముక్తమాల్యదలో ఇదే పద్యం వుంది. రాయలవారి వంశవృక్షాన్ని తానే కొనియాడడం ఔచిత్యంగా వుండదని తమను గూర్చి పెద్దన వ్రాసిన పద్యాన్ని అట్లాగే తన గ్రంథంలో వ్రాసుకున్నాడు.)

మొదటిది ఉదయగిరి దుర్గము. దీని ముట్టడి దాదాపు ఒకటిన్నర మాసం సాగింది. రాయల ప్రతాపాగ్ని ఇక్కడే మొదట రాజుకున్నది. అక్కడి నుండి గజరాజును తరిమి కొండవీటిలో కసవాపాత్రుని చంపి అక్కడినుండి విశాఖ జిల్లాలోని జామి దుర్గంపై పడి దాన్ని దహించి వేసి, దాని దగ్గర వున్న కోణాంను బుగ్గిపాలు చేసి అక్కడే వున్న కొట్టాంను చీకాకు పరిచి కనకగిరిని చెల్లా చెదరు చేసి మరలా దక్షిణం గౌతమి వరకు వచ్చి మరలా ఉత్తరం తిరిగి పొట్నూరును అగ్గిపాలు చేసి అక్కడ జయస్తంభం నాటి, మాడుగుల పైకి పోయి ధ్వంసం చేసి దానికి తూర్పున దగ్గరగా వున్న వడ్డాది కోటను మసిచేసి అక్కడి నుండి కళింగ సైన్యాన్ని తరుముకుంటూ పోయి కటకపురిని ధ్వంసం చేసి, అక్కడి నుండి గూడ గజరాజును తరిమి రాయల సైన్యాలు పూర్వోత్తర దిగ్విజయం పూర్తి చేశాయి.

ఎంత గొప్ప సైన్యమో రాయల సైన్యం! ఒకవైపు ధ్వంసంచేస్తూ కళింగసైన్యాన్ని తరుముకుంటూ పోతూ వుంటే

కొన్ని సార్లు కళింగ సైన్యం మరొక పక్కకు తొలిగి వెనుకటి దుర్గాల్ని ఆక్రమించగా, రాయల సైన్యం మరలా అటువైపు పరుగెత్తి వాళ్ళను ఓడించి తరిమినట్లు మనకీ పద్యం వల్ల విదితమవుతున్నది.

ఈ యుద్ధాలతో రాయలకు అపారమైన ధనరాసులూ, వాహనాలూ లభించాయి. ఆఖరికి కళింగరాజు సంధి చేసుకొని తన కుమార్తెను రాయలకిచ్చి వివాహం చేశాడు. ఆ రోజులలో యుద్ధాలంటే అంతేగదా: దొరికిన శత్రుస్త్రీలను చెరబట్టి తీసుకొని రావడమే. ప్రజలూ, ప్రజల ఆస్తిపాస్తులూ సర్వమూ రాజ కైంకర్యం కోసమే అన్న రోజులవి.

మరలా మహమ్మదీయులతో యుద్ధాలు జరిగాయి. రాయలీసారి తీవ్రంగా విజృంభించి బీజాపుర సైన్యాలను ఛిందర వందర జేసి సుల్తానును తరిమి ఓడించి బంధించి అవమాన పరిచాడు. తన కాళ్ళకు మొక్కి క్షమాపణ వేడుకొంటే వదులుతానన్నాడు. మొత్తానికి సుల్తానులను చాలా చిన్నపుచ్చాడు. వారి మానం మట్టి గలిపాడు. వారి హృదయాలు మండి పోయాయి. అవమానాన్ని భరించలేక సుల్తానులంతా ఒకటిఅయి దెబ్బతీయాలని ఎదురు చూడసాగారు. అయితే రాయలంటే భయంతో వణికి పోయేవారు.

కృష్ణ దేవరాయలు రాజ్యానికి రాక పూర్వమే తన తండ్రి కాలమునుండి పోర్చుగీసు వారితో స్నేహంగా వుంటూ వచ్చాడు. వారు తెచ్చే మేలుజాతి గుర్రాలను వీళ్ళే కొనేవారు. మహమ్మదీయ సుల్తానులకు అమ్మరాదన్నారు. తమ కోసం తీసుకొని వచ్చే గుర్రాలలో ఏదయిన చనిపోతే దానికి గూడా డబ్బు చెల్లించే వారు. ఆ విధంగా మేలుజాతి గుర్రాలను వైరి రాజులకు అమ్మకుండా చేసేవారు. అదేపని ఇపుడు కృష్ణ దేవరాయలు చేశాడు.

కృష్ణ దేవరాయలను నిత్యమూ ఎంతమంది రాయబారులో, విదేశస్థులో దర్శించడానికి వచ్చేవారు. ఆయన వారిని అంతగా లెక్కించినట్లు కనబడడు. వాళ్ళకు మండేది గాని రాయలు చాలా బలవంతుడు గాబట్టీ, శత్రు వినాశంలో సింహంపట్టు పట్టేవాడు గాబట్టీ భయపడే వారు.

దక్షిణానికంతటికీ పెద్దదీ, పెత్తనం చేస్తున్నదీ విజయనగరమే. దక్షిణంలో ఇపుడు చాలమంది సామంతులయి పోయారు.సింహళంపై గూడా దండెత్తి జయించడం జరిగింది. ఈ విధంగా నలుదెసలా విజృంభించి అన్ని ప్రాంతాలనూ అధీనం చేసుకొన్న కారణాన శ్రీ మన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పూర్వదక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర, శ్రీ కృష్ణదేవరాయ అన్నటువంటి బిరుదులు చాలా లభించాయి.

ఆయన నిర్మించిన భువన విజయంలో సారస్వత చర్చలూ, కవితాగానాలూ ఇతర కళాప్రదర్శనలూ జరుగుతూ వుండేవి. రాయలు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషల్లో పండితుడు. ఆయన వ్రాసినట్లుగా చెప్పబడుతున్న మదాలస చరిత్ర, సత్యవధూప్రణయము, సకల కథాసార సంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరీ కావ్యము - ఇవన్నీ సంస్కృత కావ్యాలే. అవి యీనాడు లభ్యమానాలు కావు. జాంబవతీ పరిణయం అనే నాటకాన్ని సంస్కృతంలో వ్రాసిదాన్ని భువనవిజయంలో చదివి వినిపించి తర్వాత నాటకశాలలో ప్రయోగింప జేశాడు.

తెలుగులో కేవలం ఆముక్తమాల్యదే వ్రాశాడు. ఆయన వ్రాసిన పద్యాలు భువనవిజయంలో వినిపించే వుంటాడు. ప్రతి పద్యాన్నీ చర్చించి వుంటాడు. ఎక్కువగా అల్లసాని పెద్దన అనిన గౌరవమూ, చనువూ వున్నాయి. రాయలకు ఎంత చనవంటే మనుచరిత్ర అవతారికలోని కొన్ని పద్యాలను ఆముక్తమాల్యదలో వేసుకున్నాడు. తన వంశచరిత్ర వ్రాసేటప్పుడు, అందు ముఖ్యంగా తన ప్రతాపాది విషయాలు వ్రాసేటప్పుడూ ముందే వ్రాసిపెట్టిన పెద్దన పద్యాలు వేసుకోవడం అసమంజసంగా భావింపలేదు. అదే ఆముక్తమాల్యద కర్తృత్వానికి గొడవ తెచ్చిపెట్టింది. రాయలవారి శైలీ

పాండిత్యాలనూ, పెద్దనగారి శైలీ పాండిత్యాలనూ చవిచూచిన కవి, విమర్శకులెవ్వరూ ఆముక్తమాల్యద పెద్దన కృతము అనుకోలేరు. అంత శైలీ భేదముంది గనుక. ఇంతెందుకు ఆముక్తలో వుండే పెద్దన పద్యాలకూ, ఆ తర్వాత గ్రంథమంతా నడిచిన పద్యాలకూ శైలీ భేదం కరిమశకాంతరం. రాయలవారి సంస్కృత పదగుంఫనం మరెవరికీ రాదు. రాయలవారు కవి అనిగానీ, ఆయన ఆముక్తమాల్యదాది కావ్యాలు వ్రాశాడని గానీ పెద్దన పేర్కొన లేదనడం సబబు గాదు. ఆయన వ్రాసివుండి వుంటాడు. తర్వాత ప్రతులు తయారు చేసినవారు సంస్కరించి వుండవచ్చు, అబ్రాహ్మణుడు కవిత్వం వ్రాయగూడదన్న వాదం వుందిగదా. అసలు స్త్రీ శూద్ర విద్యా నిషేధం వుందిగదా, పోనీ ఆ తర్వాత అబ్రాహ్మణ కవులయినా రాయలవారే ఆముక్తమాల్యద కర్త అని వుండవచ్చుగదా అని అనవచ్చు. కవి పండితులంతా బ్రాహ్మణులే గాబట్టి వారి ప్రాపు అవసరం గాబట్టి ఈ అబ్రాహ్మణ కవిపండితులు ఆ విధంగా వ్రాయడానికి సాహసించి ఉండకపోవచ్చు. పెద్దన తిమ్మనాదులు వ్రాసేవున్నారు గదా. రాయలు కవి అనిన చాలు.

అసలీ చర్చ రాయలవారి భువనవిజయంలోనే వచ్చి వుంటుంది. నన్నెచోడుడు, గోనబుద్ధారెడ్డి, రాయలూ, మొల్ల,

భట్టుమూర్తి, చేమకూరి వెంకట కవీ మొదలయిన మహోద్దండ కవుల సారభూతకావ్యాలు చదువుతూ గూడా అంఘ్రిభవుని కావ్యమంగీకృతం కాదు అన్న లాక్షణికుడు అప్పకవి మనకు స్పష్టంగా కనిపిస్తున్నాడు. మరి ఈ కులభేద దృష్టి ఆనాడు గూడా, అంటే రాయలకాలం నాడు గూడా వుండి వుంటుంది గదా. అందుకే భువనవిజయంలో పెద్దనగారి పద్యాలు ఆముక్త మాల్యదలో వేసుకోగూడదని కొందరు అని వుండవచ్చు. అప్పట్లో ఎవరూ దాన్ని అంగీకరింపక పెద్దనాదులంతా ఆముక్తమాల్యదలో వేసుకోవచ్చు అని నిర్ధారించి వుంటారు. రాయలు ఒప్పుకున్నాడు. తీరా వేసుకున్నాక ఆముక్తమాల్యదకు ఆ అపప్రథ రానే వచ్చింది తర్వాత తర్వాత.

## కవిగా రాయలు

విజేతగా ఎంత అరివీర భయంకరుడో, కళాకారుడుగా, గ్రంథ ప్రణేతగా రాయలు అంత ప్రియంకరుడు. తన రాజనీతి చాతుర్యంవల్లా, శత్రుదమనత్వంవల్లా, ఇరుగుపొరుగు రాజ్యపాలకులకూ,సామంతులకూ సింహస్వప్నంగా తయారైన కారణంగా ఆంధ్రరాజ్యంలోనూ, పొరుగు ప్రాంతాల్లోనూ,

మహమ్మదీయ రాజుల ప్రాంతాల్లోనూ శాంతి నెలకొన్నది. ఆ కారణంచేత రాయలు భువనవిజయ మందు కళా సేవలో నిమగ్నుడు కాగలిగాడు. రాయల కాలంలోనే సర్వకళలూ అభివృద్ధి పొందాయి. కవితకు పట్టాభిషేకం జరిగి, ప్రౌఢ కవుల మేటికవితలు ఈ కాలమందే వెలిశాయి. సంస్కృతంలో రఘువంశం, కుమార సంభవాది పంచకావ్యాలకు ప్రశస్తి వచ్చినట్లుగానే, రాయల యుగంలో మనుచరిత్ర, వసుచరిత్రా దులు పంచకావ్యాలుగా గణింపబడి కవిత్వ, పాండిత్యాలు ఉన్నత స్థితిలో పొందాలనుకునే వారంతా చదవదగిన పంచ కావ్యా లయ్యాయి.

## అష్టదిగ్గజాలు

మొదటగా యెన్నదగిన కవి అల్లసాని పెద్దన. కవితా పితామహ అన్న బిరుద మందినవాడు. రాయలచే గండ పెండేరమును తొడిగించుకున్న వాడు. అల్లసాని ఆ సమయంలో ఊరేగునప్పుడు స్వయంగా రాయలే పల్లకిని తన కేల పట్టి యెత్తినాడు గూడా. కవులంటే అంత ప్రీతి. అల్లసానిపెద్దన అంటే అమితమైన మమత.

ఆంధ్ర కవితా పితామహ అల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్ను పిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేగలేక
బ్రదికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు" అని

అవసానదశలో రాయలను తలచుకొని పరిదేవనం చేశాడు పెద్దన. రాయలవారి పట్టాభిషేకం తరువాత రచించిన మను చరిత్రను రాయలకే అంకితం చేసి మర్యాదలందినవాడు. ఆనాడు పెద్దన అగ్రహారాలు పొందినవాడు. ఆయన వ్రాసిన మనుచరిత్ర ప్రబంధములలో మొదటిదీ, రసవత్తర మైనదీను.

## నంది తిమ్మన

పారిజాతాపహరణ కర్త నందితిమ్మన. ముక్కుతిమ్మన అన్న నామాంతరంగూడా గలదు. కృష్ణదేవరాయల దేవేరికి గురువు. ఆస్థానంలోనూ, అంతఃపురములోనూ గూడా పలుకు బడి గలవాడు. చనువుగలవాడు. తన పారిజాతాపహరణ కావ్యాన్ని రాయలకే అంకితమిచ్చాడు.

## ధూర్జటి

శైవకవి. కాళహస్తిమాహాత్మ్యాన్ని వ్రాశాడు.

## అయ్యలరాజు రామభద్రుడు

రామాభ్యుదయకర్త.

## మాదయ్యగారి మల్లన

రాజశేఖర చరిత్ర కృతికర్త.

వీరయిదుగురు గాక, పాండురంగ మాహాత్మ్యకర్త తెనాలి రామకృష్ణ కవి, పోటీ కావ్యమైన వసుచరిత్రను వ్రాసిన భట్టుమూర్తి, సరసకథాకథన పాటవ సంపన్నుడై కళాపూర్ణోదయమూ, ప్రభావతీ ప్రద్యుమ్నమూ వ్రాసిన పండిత కవి పింగళి సూరనా, రాయల ఆస్థాన కవులనియే చాలా మంది నమ్మకం. వీరేగాక కందుకూరి రుద్రయ, సారంగు తమ్మయ, సంకుసాల నృసింహకవి మొదలయిన ఆంధ్ర కవులూ, ఇతర తమిళ, కర్ణాటకవులూ రాయల ఆస్థానంలో వున్నారని కొందరి భావన.

నిత్యమూ భువనవిజయంలో అనేకానేక కవితా ప్రసంగాలూ, విమర్శలూ జరుగుతూ వుండేవి. రాయలంతటి కవితాలోలుడు, కవిపోషకుడు అయినరాజు మరొకడు మన చరిత్రలో లేనే లేడు, సంస్కృతంలో భోజరాజు తప్ప.

ఆ రోజులలో కవిత్వం చెప్పగలిగిన రాజవేశ్యలు ఉండేవారని అంటారు. కాని కవయిత్రులు రాయల ఆస్థానంలో లేరు. మొల్ల రాయల యుగంలోని కవయిత్రి. అయితే తంజావూరు నాయకుల కాలంలోనే రామభద్రాంబ, మధుర వాణి, రంగాజమ్మ, తరిగొండ వెంకమాంబ లాంటి కవయిత్రులు వెలసినారు. రాఘునాథనాయక, విశ్వనాథనాయకాదులు రాయల మాదిరే కవితా సేవ చేశారు.

## ఆముక్తమాల్యద-కథాసంగ్రహం

ఆముక్తమాల్యదకథ చాలా చిన్నది. వర్ణనలు అధికం. రాయలు వైష్ణవుడు. అందుకే వైష్ణవభక్తిని గురించి చాలా వర్ణించాడు ఆముక్తమాల్యదలో.

ఇందులో ఇష్టదేవతా ప్రార్థన తర్వాత రాయలవారి వంశ వర్ణన వుంది. తన వంశాన్ని, ముఖ్యంగా తన శౌర్యాది కాలనూ వర్ణించే ఘటాల్లో స్వీయ ప్రశంస బాగుండదన్న

అభిప్రాయంతో ఇదివరకు మనుచరిత్రలో అల్లసాని పెద్దన రచించిన రాయలవారి వంశవర్ణన, రాయలవారి ప్రతాపమూ వ్రాసిన ఘట్టాలను అలాగే ఆముక్తమాల్యదలో చాలా భాగం వ్రాసుకున్నాడు. అది న్యాయమే.

కవిగారికి శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణువు కలలో ప్రత్యక్షమై ఆముక్తమాల్యద గ్రంథాన్ని తెలుగులో వ్రాయ వలసిందని సెలవిచ్చారు.

పాండ్యరాజుల పాలనలోని విలుయిత్తూరు వర్ణనతో కావ్యం ప్రారంభమవుతుంది. పురవర్ణనలో ఏవేవి వర్ణించాలో సంప్రదాయం ప్రకారం వర్ణించాడు. ఇక్కడ నారికేళ వృక్షాలనూ, స్నానంచేసి పూజార్థం దేవాలయానికి నీళ్లు మోసుకొని పోతున్న ద్రవిడాంగనల అందాలనూ, పురంలోని వేశ్యల సరసప్రవర్తనలనూ,చెంగలువకేదారాలనూ, ఆరామం లోని పనస చెట్లనూ, తీర్థకుండాలనూ, వరిమళ్ళూ చెరకుతోట ల్లోని చిన్నకాలువలనూ, అందలి బాతులనూ, సుగంధ కదళీ వృక్షాలనూ, దేవాలయాన్నీ, భాగవతుల ఆతిథ్యాన్నీ రస బంధురంగా వర్ణించిన అనంతరం విష్ణుచిత్తుడనే విష్ణుభక్తుణ్ణి వర్ణిస్తాడు కవి.

తర్వాత మధురాపురవర్ణన. గజ, హయ, భటాదులనూ, నాలుగు వర్ణాల వారినీ, మేడలనూ, దేవాలయాలనూ, పుష్ప

లావికలనూ, వేశ్యలనూ వర్ణించిన అనంతరం, మధురాపుర రాజయిన పాండ్యుని వర్ణిస్తాడు. ఈ సమయంలో గ్రీష్మర్తు వర్ణన చేస్తాడు. పాండ్యరాజయిన మత్స్యధ్వజుడు వేశ్యా గృహానికి పోతూ దారిలో పరదేశి విప్రుడు చదివే పద్యాల సారాన్ని గ్రహించి మోక్షదృష్టిలో పడి, శివుడు గొప్పో, విష్ణువు గొప్పో తెల్పుకోవాలని రాజసభలో పరీక్ష పెట్టిస్తాడు. విష్ణుదేవుడి ప్రోత్సాహంతో విష్ణుభక్తుడు అయిన విష్ణుచిత్తుడు మధురానగరికి వెళ్ళి విష్ణువే గొప్ప వేలుపు అని వాదించి గెలుస్తాడు. అప్పుడు వాద నిర్ణయం సరి అయినది అని తెలగానే వేలాడగట్టిన శుల్కంమూట వూడి కిందపడిపోతుంది. అప్పుడు మత్స్యధ్వజుడు వైష్ణవుడయిపోతాడు.

పై వాద సమయంలోనే విష్ణుచిత్తుడు ఖాండిక్య కేశి ధ్వజోపాఖ్యానం చెబుతాడు. కృతధ్వజనందనుడయిన కేశి ధ్వజుడూ, మితధ్వజనందనుడయిన ఖాండిక్యుడూ రాజ్యం కోసం పోట్లాడుకుంటారు. ఖాండిక్యుడు ఓడిపోయి అడవికి పారిపోతాడు. కేశిధ్వజుడు రాజ్యం చేస్తూన్నాడు. అతడు ఒక యాగం తలపెట్టి చేస్తూ వుండగా యాగధేనువును పులి చంపేసింది. దానికి ప్రాయశ్చిత్తం కోసం కేశిధ్వజుడు చాలా మందిని సంప్రదిస్తాడు. ఎవరూ చెప్పలేకపోయారు. ఆఖరికి ఖాండిక్యుడే చెప్పగలడని విని కేశిధ్వజుడు ఖాండిక్యుని

దర్శించడానికి వెళ్ళాడు. అప్పుడు ఖాండిక్యుని సంబంధు లందరూ కేశిధ్వజుని చంపి రాజ్యం లాక్కోవలసిందిగా బోధిస్తారు. ఖాండిక్యుడు అది వినడు. కేశిధ్వజునికి ప్రాయశ్చిత్తాన్ని బోధిస్తాడు. అతడు వెళ్ళిపోయి యాగం పూర్తి చేసి గురుదక్షిణ యిస్తానని ఖాండిక్యుని దగ్గరికి తిరిగి వస్తాడు. రాజ్యాన్ని కోరుకొమ్మని అతని మనుషులంతా అన్నప్పటికీ ఖాండిక్యుడు కోరడు. రాజ్యాన్నిస్తానని కేశిధ్వజుడు అన్నప్పటికీ ఖాండిక్యుడు ఒప్పుకోడు. సంసార లాంపట్యంలో పడను అని చెప్పుతాడు. ఇద్దరి మధ్యా కొంత వేదాంత చర్చ జరుగుతుంది. ఆఖరికి కేశిధ్వజుడు ఖాండిక్యుని ఒప్పించి అర్ధ రాజ్యం ఇస్తాడు. అతడు పుచ్చుకొని తన కుమారునికి ఆ రాజ్యం అప్పజెప్పి తాను యోగంలో వుండిపోతాడు. అట్లాగే కేశిధ్వజుడు గూడా చేస్తాడు. ఇద్దరూ గూడా యీ విధంగా విష్ణుభక్తులై పోతారు. రాజ్యాధికారం కంటే వైష్ణవభక్తి గొప్పది అని ఇక్కడ రుజువు చేస్తాడు కవి.

పై కథ తన వాదానికి బలకరంగా విష్ణుచిత్తుడు చెప్పగానే సభలో అహోవాకముల విజృంభణమూ, ఆనందకోలాహలమూ కనిపిస్తాయి. విష్ణుభక్తుడు ఈ విధంగా గెలిచి వెళ్లాక అతనికి విలుబుత్తూరులో విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు మత్స్యావతారాది అవతార స్తుతి చేస్తాడు విష్ణుచిత్తుడు.

తర్వాత విష్ణుదేవుడు ఒక మధ్యాహ్న వేళ తనను పూజించి వెళ్ళిపోతున్న విష్ణుచిత్తుణ్ణి లక్ష్మీదేవికి చూపించి "ఈ మహాత్ముడూ, యామునాచార్యుడూ నా మతాన్ని నిలబెట్టారు" అని అంటాడు. అపుడు యామునాచార్యు డెవరు అని లక్ష్మీదేవి అడుగుతుంది. విష్ణుదేవుడు కథ చెప్పడం మొదలు పెట్టాడు.

"యామునాచార్యుడు నాథముని మనుమడు. వంశ పారంపర్యంగా వస్తున్న వైష్ణవ భక్తి పరాయణుడు. ఈ పాండ్యరాజు పూర్వుడే అయిన ఒక రాజు, వెర్రి శైవం ముదిరి నా భక్తులను అవమాన పరుస్తూ వుంటే, ఆ రాజుభార్యచేత ప్రేరితుడై యామునాచార్యుడు వాదానికి వచ్చి, వాదించి, విష్ణువే పరతత్త్వము అని తేల్చి రాజును విష్ణుభక్తుణ్ణి చేస్తాడు. అపుడా రాజు యామునాచార్యుడికి తన కడగొట్టు చెల్లెల్ని ఇచ్చి పెండ్లి చేసి అర్ధరాజ్యాన్నిస్తాడు. అతడు పరిపాలనా మగ్నుడయి పోతాడు. దండయాత్ర చేసి రాజ్య విస్తరణ చేయాలని తలపెడతాడు. ఇంతలో వర్షరుతువు ప్రవేశిస్తుంది. ఇక్కడ వర్షరుతు వర్ణన మన కవి కృష్ణదేవరాయలు అతివేల మనోహరంగా, సహజవర్ణనలతో వర్ణిస్తాడు. వర్షరుతువు అయిపోయి శరదృతువు రాగానే యామునుడు దండయాత్ర చేసి రాజ్యాలను గెలుస్తాడు. తర్వాత ఎంతో వైభవంగా

జీవిస్తూ వుంటాడు. తన తాత నాథముని శిష్యుడైన పుండరీకాక్షుని శిష్యుడు రామమిశ్రుడు వచ్చి యామునాచార్యుని వైభవ జీవితం నుండి మరల్చడానికై ప్రతి రోజూ అలర్క శాకము తీసుకొని వచ్చి, ఆ వంట, యామునాచార్యునికి పెట్టే యేర్పాటు చేశాడు. ఒకనాడు యామునాచార్యుడు రామమిశ్రుని వివరాలూ ప్రయత్నాలూ తెలుసుకున్నాడు. మిశ్రునితో మాట్లాడాడు. అతడు కొన్ని విషయాలు చెప్పి, మీ పితృదేవతలు స్థాపించిన నిధిని నీకు చూపుతాను రమ్మన్నాడు. తీసుకొనివెళ్ళి శ్రీరంగనాథుని పాద దర్శనం చేయిస్తాడు. యామునుడు తాను తప్పుదారిలో వున్నానని తెలుసుకొని తన కుమారుడికి రాజ్యాభిషేకం చేసి, రాజనీతిని బోధించి వానప్రస్థ ఆశ్రమాన్ని స్వీకరిస్తాడు.

ఇక్కడ యామునుడు తన కుమారునికి చెప్పిన రాజనీతి కేవలం శ్రీకృష్ణ దేవరాయల రాజనీతే. ఇందులో రాయలు ఎంతో రాజనీతిజ్ఞతనూ,లోకజ్ఞతనూ ప్రదర్శించాడు.

వెంటనే వసంత ఋతువును వర్ణించాడు కవి. వసంత ఋతువులో ఏయే వర్ణనలుండాలో అన్నీ వున్నాయి. విల్లిపుత్తూరులో విష్ణుచిత్తుడు పూజా వనంలోకి వచ్చినపుడు ఒక పూపొద దగ్గర ఒక చిన్న పాప దొరుకుతుంది. అతడు అవివాహితుడు. అయినా ఆ పసిబిడ్డను ధర్మపుత్రికగా, భగవద్దత్తగా

స్వీకరించి పెంచసాగాడు. కొన్ని సంవత్సరాలకు ఆమె యుక్తవయస్క అయింది. విష్ణువును ప్రేమించింది. ఆమె ప్రేమాలాపనలకు చెలికత్తెలు హాస్యమాడసాగారు. ఆమె మదన జ్వరంలో బాధపడసాగింది. ఈ వసంత ఋతువులో గోదాదేవి చెలికత్తెలతో వన విహారం చేస్తుంది. పుష్పాపచయమూ, దోహదక్రియలూ, విరహబాధా, శైత్యోపచారాలూ జరుగుతాయి. ఉపాలంభన గూడా ప్రబంధోచితంగా జరగాలి గదా! ఇతర ప్రబంధాలలో అయితే, మలయమారుతోపాలంభనా, చంద్రోపాలంభనా, మదనోపాలంభనా మొదలయినవి సాగుతాయి. అయితే ఇక్కడ నాయిక విష్ణు విరహంలో వుంది కాబట్టి అన్యాపదేశంగా విష్ణువు ఆయా అవతారాల్లో ఏం చేశాడో వాటినే ఉపాలంభన రూపంలో ప్రయోగిస్తుంది.

ఆమె యీ చేష్టలు చూచిన విష్ణుచిత్తుడు ఇదేదో యోగమనుకుంటాడు. తమ యోగంకంటే భిన్నంగా వున్నదని శ్రీవిష్ణువుకు నివేదించుకుంటాడు. ఈ భక్తి పలురకాలుగా వుంటుంది అని విష్ణువు మాల దాసరి కథను విష్ణుచిత్తునికి చెబుతాడు.

మాలదాసరి ఈనాటి వాడు గాడు. శ్రీ విష్ణువు వామనావతారంలో వున్న రోజుల్లో తానుండిన ప్రదేశానికి మూడు యోజనాల దూరంలో వున్న పూరిలో వుండే వాడు. నిత్యమూ

భగవద్భక్తితో పాటలు పాడుతూ, నృత్యంచేస్తూ వుండేవాడు. బ్రాహ్మణాదులు కనిపిస్తే దూరంగా జరిగిపోతూ దేవాలయం ముందు,వీథిలో,భక్తితో నృత్యం చేస్తూ, పందేరాన్ని శూద్రుడు ఎత్తివేస్తే అందుకొని తింటూ విగ్రహం దగ్గరనుండి బయటికి ప్రవహించే నీటిని బయట తూము దగ్గర శూద్రుడు దోసిట్లో పోస్తే త్రాగుతూ ఏమాత్రమూ భేషజం లేకుండా వుండేవాడు.

ఒకరోజు రాత్రి పొరపాటున ఏదో అపాయాన్ని శంకించి కోళ్ళు కూశాయి. తెల్లవారు ఝాము అయిందని లేచి మాలదాసరి దేవాలయంపోతూ, దారితప్పి బ్రహ్మరాక్షసు డుండే చోటికి చేరుకున్నాడు. బ్రహ్మరాక్షసుడు అతనిని తరిమి పట్టుకున్నాడు. దేహరక్ష చేసుకొనితీరాలి గాబట్టి బ్రహ్మ రాక్షసుడితో పెనుగులాడి ఓడిపోయాడు దాసరి. బ్రహ్మరాక్ష సుడు దాసరిని తన కాహారం కమ్మన్నాడు. దేవుడి గుడికి వెళ్ళి కైంకర్యం చేసి వస్తానని అన్నాడు. రాక్షసుడు ఒప్పుకోలేదు. నేను మాట ప్రకారం రాకపోతే విష్ణువు తప్ప మరొక వేల్పు గొప్పవాడు అన్న పాపానికి పోతాను అని మాలదాసరి అనగానే బ్రహ్మరాక్షసుడు వదలి వేశాడు. మాలదాసరి గుడికి వెళ్ళి ప్రార్థన చేసి, తిరిగి వచ్చి బ్రహ్మరాక్షసుడితో తనను తిన వలసిందిగా కోరాడు. బ్రహ్మరాక్షసుడు మాలదాసరిని మెచ్చు కొని, కాళ్ళపై బడి తనను రక్షించవలసిందిగా కోరాడు.

ఈనాటి పాటఫలమైనా ఇమ్మన్నాడు. ఒప్పుకోలేదు. పోనీ ఆఖరి చరణం యొక్క పుణ్యమయినా నాకు దత్తం చెయ్యమని ప్రార్థించాడు. అఖరికి మాలదాసరి ఒప్పుకొని ఆ ఫలాన్ని ఇచ్చి బ్రహ్మరాక్షసత్వాన్ని పోగొట్టాడు. బ్రహ్మరాక్షసుడు పూర్వజన్మలో ఒక భ్రష్టబ్రాహ్మణుడు. మాలదాసరి ప్రభావం వల్ల అతనికి ఇపుడు పుణ్యం లభించి, దాని ఫలంగా ముక్తి కలిగింది.

తర్వాత గోదాదేవికీ, శ్రీరంగనాథునికీ వివాహం జరిగి నట్లుగా వర్ణించాడు కవి. దీనితో కథ ముగిసింది.

ఈ విధంగా విష్ణుభక్తిని గూర్చి చెప్పే ఉపాఖ్యానాల నన్నిటినీ గుదిగూర్చి అనేక వర్ణనలతో, అలంకారాలతో, రీతి, రసపాకశుద్ధితో, ఈ ఆముక్తమాల్యదా గ్రంథాన్ని రచించాడు శ్రీకృష్ణదేవరాయలు. ఇతని శైలి అనన్య సామాన్యం. అలం కార ప్రయోగం అనితర సామాన్యం. ఎంతో పాండితీపూర్ణ కవితాశక్తితో ఆముక్తమాల్యద రచించారు రాయలు.

ఎందరో పరిపాలకులున్నారు. కాని రాయల వంటి పరిపాలకులు లేరు.

ఎందరో యోధులున్నారు. కాని రాయల వంటి యోధుడు లేడు.

ఎందరో కవులూ, రాజకవులూ ఉన్నారు. కాని రాయల వంటి రాజకవి లేడు. కవిరాజూ లేడు.

## ఆముక్తమాల్యద రచనా విశిష్టత

1509 లో రాయలు పట్టాభిషిక్తుడైనాడు. అప్పటి నుండి ఆయన సామ్రాజ్య విస్తృతికీ, పటిష్ఠతకూ పూను కున్నాడు. సర్వ దిగ్విజయాలకు 1510 లో బయలుదేరిన యాత్ర 1520 లో జరిగిన రాయచూరు యుద్ధంతో అంత మయింది. తన మాటకు ఎదురాటలేని రీతిలో శాంతి సమ యంలో కావ్య రచనకూ, కావ్యాల అంకితాలకూ పూను కున్నాడు. 1515, 16 సంవత్సరాలలో కళింగరాజులను తరుముతూ పోతూ బెజవాడ సమీపంలోని శ్రీకాకుళం ఆంధ్ర మహావిష్ణువును సేవింపబోయి అక్కడ కల గని, ఆ కలలో దేవుని యాజ్ఞగా ఆముక్తమాల్యద రచనకు పునాదులు వేసి కొని, భువన విజయ కవులచేత అమోఘ గ్రంథ రచనలు చేయిస్తూ తాను 1520 తర్వాతనే ఆముక్తమాల్యదను పూర్తి చేసినాడు.

ప్రబంధాలన్నీ ప్రశాంత వాతావరణం తోనే వ్రాయ బడ్డాయి. అల్లసాని పెద్దనతో 'కృతిని నిర్మింపుము' అని రాయలు కోరినపుడు,

"నిరుపహతి స్థలంబు రమ
ణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన
భోజన ముయ్యాల మంచమొప్పు త
ప్పరయు రసజ్ఞులూహ తెలి
యంగల లేఖక పాఠకోత్తముల్
కలిగిన గాక యూరక కృ
తుల్ రచియింపు మనంగ శక్యమే"

అని అన్నాడు.

నిరుపహతి స్థలం కాకపోతే రచన సాగదని గదా అర్థం! అంటే ప్రశాంత వాతావరణం ఉండాలన్నమాట. అంతేగాదు ఉల్లాసజనకమైన వాతావరణం గూడా కావాలి. మరి ఆ గొప్ప గొప్ప కవులకూ, రాజకవులకూ, కవిరాజులకూ ఉల్లాసం కలగాలంటే రమణీప్రియదూతిక హొయలు గులుకుతూ వచ్చి కప్పురవిడెము అందించాలన్నమాట. అంతేగాదు, ఆత్మ కింపయిన భోజనం వుండాలట, ఉయ్యాలమంచం గూడా వుండాలట. అంతటితో సరిపోదట. ఒప్పు తప్పు తెలిసి చెప్పే రసజ్ఞులూ, కవిగారి ఊహను కనిపెట్టి అవసరం అయితే పదాలు సైతం అందించే లేఖక పాఠకోత్తములూ వుండాలట.

ఇటువంటి వాతావరణం భువనవిజయంలో వుండాలంటే యుద్ధాలు లేని శాంతిసమయమై వుండాలి.

ఇటువంటి ప్రశాంత సమయం గావాలని ప్రతి కవీ కోరుకొంటాడు. అంతకు ముందే కన్నడ కవులు ఈ విషయాన్నే చెప్పివున్నారు. కన్నడ కవిత్వం తెలిసిన పెద్దన దాదాపు ఆ కన్నడ పద్యాన్నే తెలుగులో పెట్టాడు. ఏ భాషలో వుంటేనేమి. కవులందరికీ కావలసిన వాతావరణము, కోరుకొనే వాతావరణము, అటువంటిదే.

ఇలాంటి ప్రశాంత వాతావరణంలోనే- ప్రశాంత సమయంలోనే,- మనుచరిత్ర, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద మొదలయిన మహా ప్రబంధాల రచన సాగింది.

మహాకవులనూ, పండిత కవులనూ, విమర్శకులనూ మెప్పించాకనే ఆ పద్యాలు పద్యాలుగా, ఆ కవిత కవితగా ప్రచారంలోకి వచ్చేవి. లేకపోతే ప్రచారంలోకి రావు. ఆ పద్ధతిలో ఎన్నెన్ని కావ్యాలు పైకి రాలేక కూలబడిపోయాయో గాని మెరికలు మాత్రమే పైకి వచ్చాయి. ఆ మెరికలలో పెద్ద మెరిక ఆముక్తమాల్యద.

ఆమూక్తమాల్యద చదువుతూ వుంటే యేదో లోకాల్లో విహరించినట్లుంటుంది. నన్నయ రచించిన భారతం చదవడానికి పూనుకుంటే, రకరకాలవారికి రకరకాలరూపంలో

కనిపించినట్లుగా, రాయలవారి ఆముక్తమాల్యద చదువుతూ వుంటే రసజ్ఞులకు రసజుష్టంగానూ, ఆలంకారికులకు నవరత్న పేటికగానూ, అర్థజ్ఞులకు సర్వార్థనిధిగానూ, పాండితీ పూజారులకు నూత్నార్థ సంస్కృత పదకోశంగాను, వర్ణనా ప్రియులకు సర్వభావపూర్ణ ఇంద్రధనుస్సుగానూ అన్ని విధాలుగా భాసించే యీ ఆముక్తమాల్యద కావ్యం-సంస్కృతాంధ్ర భాషలు పడుగూపేకగా నేయబడిన పట్టుపుట్టమైన యిట్టి కావ్యం - న భూతో న భవిష్యతి.

ఆపదగుంఫనము, ఆశైలి, ఆ అలంకారాల పోహళింపు, ఆ సార్థకపదప్రయోగము, ఆ భావౌన్నత్యమూ చూస్తూవుంటే, ఏకాంతంగా కూర్చొని చల్లని పుండ్రేక్షుకాండాన్ని నముల్తూ రసాన్ని పీల్చినట్టేవుంటుంది. ఆ పాండిత్యాన్ని చవిచూచేకొద్దీ మనకు ఇతోధిక పాండిత్యం వుంటే ఎంత బాగుండును అని అనిపిస్తూ వుంటుంది. ఇంత ప్రౌఢంగా కవిత్వం మనం చెప్ప గలిగితే ఎంత ఉన్నతి పొందగలమో అనిపిస్తుంది. ఒకవేళ అది అలవడితే రాయల లాగా కవిత్వం వ్రాయాలనిపిస్తుంది. యింతకూ ఆముక్తమాల్యద యింత గొప్ప గ్రంథం కావడానికి దానిలో వుండే గొప్పదనం యేమిటి?

ఇది వర్ణనా ప్రధానమైన కావ్యం. కవియొక్క భావ ప్రౌఢిమకు వర్ణన గీటురాయిగదా! అసలు కవిత్వం అనే పదానికి అర్థం వర్ణన అనే గదా!

ఆముక్తమాల్యదలో గల పద్యాలు మొత్తం 876. ఇందులో కేవలం ప్రకృతి వర్ణనలకు సంబంధించినవి 225. అంటే 26 శాతం అన్నమాట. నన్నెచోడుని కుమారసంభవం మొత్తం 2005 పద్యాలు. అందులో వర్ణన పద్యాలు దాదాపు 400 ఉన్నాయి. అది 20 శాతమే. ప్రకృతి వర్ణనా ప్రధాన కావ్యమైన వసుచరిత్రలోగూడా కేవల వర్ణన పద్యాలు 20 శాతమే.

కేవలం వర్ణనల కోసం రాయలు ఈ కావ్యాన్ని చేపట్టారా అన్నట్లుగా కనిపిస్తుంది. ఈ కావ్యంలో అంతా అటు ప్రకృతి వర్ణనలూ, ఇటు వైష్ణవమత ప్రచారమూనూ. ఆముక్తమాల్యదలో గల వర్ణనాబాహుళ్యమూ, వర్ణనా వైవిధ్యమూ మరే కావ్యంలోనూ లేవు. ఇతని ప్రకృతి వర్ణనల్లో సూక్ష్మపరిశీలనా, పటిమా, లోకజ్ఞతా ప్రతిబింబిస్తూ వుంటాయి.

ప్రబంధాలన్నింటి లోనూ ఋతువర్ణనా ప్రధానమైన ప్రబంధం ఆముక్తమాల్యద. ఋతువుల సహజ పద్ధతిలో వర్ణించినవాడు రాయలే. గ్రీష్మ, వర్ష, శరత్, వసంత ఋతువులను

క్రమంగా వర్ణించాడు. రాయలు అన్ని రుతువులలోనూ ప్రకృతిని బాగా పరిశీలించినవాడు. ఆయా సమయాలలో ప్రకృతీ, ఇతర జంతుప్రకృతీ, ఎలావుంటాయో బాగా పరిశీలించినవాడు. సాంప్రదాయికంగా గ్రీష్మరుతువు ఎలా వుంటుందో చూద్దాం.

నిర్ఝర ప్రబలవేణిక లింక జట్రాల
చేరినప్రాచి పెన్బేటు లెగసె
నెఱకులు పడియనీ రివురగువ్వలబట్ట
బోయు నీరాడాడ బొలమునెఱసె
........................
........................
........................
........................ ఆముక్త.ఆశ్వా. 2-46

పై పాదాల్లో ఎంతో స్వాభావికత కనిపిస్తున్నది. అడవులలో తిరుగుతూ సెలయేళ్ళు పరికిస్తూ వున్న వారికే ఇవి బాగా అర్థమవుతాయి. ఎండాకాలంలో నిర్ఝరాలు - అంటే సెల యేళ్ళు - ఎండిపోతాయిగదా! నీళ్ళు పారే రోజుల్లో చట్రాళ్ళకు పాచి బాగా పట్టివుంటుంది. నీళ్ళు ఇంకిపోగానే ఆ పాచి యెండుతుందిగదా! అది పేట్లు పేట్లుగా రేగుతుంది. ప్రకృతిని ఎంతో పరిశీలించిన కవి అయితేనే యిది వ్రాయగలడు.

సాధారణంగా వేటకు పోయే అలవాటున్న వారికే యిది విదితము. ఎండకు పడియలలో నీరింకిపోతుంది. ఇతర కవులయితే నీరంతా యింకిపోయిందని స్వాభావికంగానో ఉత్ప్రేక్షగానో వర్ణిస్తారు. రాయలవారు స్వయంగా వేటకు వెళ్ళే వ్యక్తిగదా. జింకలు మొదలయిన జంతువులు, పక్షులు ఈ పడియలదగ్గరికి వస్తాయి. ఇప్పుడు గ్రీష్మంగావచ్చు. అయినా అలవాటుచొప్పున అవి వస్తాయి. అది వేటగాళ్ళకు తెలుసు. ఆ వేటగాళ్ళు ఎరుకలవారట. వీళ్ళు పూరేళ్ళు, కముజులు, అడవికోళ్ళు పట్టుకుంటారు. దప్పిగొని పడియల దగ్గరికి అవి వస్తే, నీరింకిపోయిన పడియలలో, నీరున్నట్లుగా తెలియ జెయ్యటానికి కాస్త నీళ్ళు తెచ్చి ఆ పడియలలో పోసి అక్కడ ఉచ్చులు ఒడ్డి కనబడకుండా కూర్చుంటారు వేటగాళ్ళు. ఆ నీటిని గురించి రాయలవారు చెప్పడం ఎంతో పరిశీలనతో గూడిన విషయం.

ఇంకొక మంచి వర్ణన చూద్దాం.

కలిగినవారు ముదురు మామిడి ముక్కల తాళింపులతో ఉడికిన చేపముక్కలను హాయిగా భోంచేసి, మధ్యాహ్నము సేదదీర్చుకొంటారు. ఆ తర్వాత నిద్ర లేచినపుడు కనరు తేన్పులు వస్తాయి. ఆ కనరు పోవడానికి ఇసుకలో పూడ్చిన టెంకాయ బొండ్లాములోని నీరు తాగుతారు. ఇది

స్వభావవర్ణన. అటువంటి ఆహారానికి అలవాటుపడిన వారికే యీ వర్ణన చేతనౌతుంది. ఈ వర్ణనను ఆధారంగా తీసుకొని ఈ ఆముక్తమాల్యదను శూద్రుడైన కృష్ణదేవరాయలే రచించాడుగాని బ్రాహ్మణుడైన పెద్దన రచించలేదు అనడానికి కొందరు సాక్ష్యంగా తీసుకోడం హాస్యాస్పదం. చేపలకూర రుచిచూసినవాడే వ్రాయాలని ఎక్కడ వుంది? విని తెలుసుకుని బ్రాహ్మణుడుకూడా వ్రాయవచ్చు. ఇటువంటి సాక్షులూ తర్కాలూ అక్కరలేదు. ఇది రాయలకృతం అని చెప్పడానికి.

గీష్మరుతు వర్ణన సంప్రదాయం కోసమూ, వర్ణన కోసమూ చెయ్యలేదు రాయలు. రుతువర్ణన చెయ్యడానికి, సందర్భం కావాలిగదా. అతిథులుగా వచ్చి, సుష్టుగా భోంచేసి బ్రాహ్మణులు దారిలోని తిన్నెలపై వెన్నెలలో పరుండి ఉబుసుపోకకై కందాలూ, గీతాలూ, సుభాషితాలూ చదువుతూ వుండగా, వేశ్యాగృహంపోవడానికి బయలుదేరిన పాండ్యరాజు వారి సంభాషణ విని, అందలి వేదాంతాన్ని విని వైరాగ్యాన్ని తెచ్చుకొని, యింటికి తిరిగి పోయి, విష్ణువు గొప్పా, మరొక వేలుపు గొప్పా అని చర్చ చేయడానికి నానా దిశలనుండి వేదాంతులను రావించి సభజేసి వాగ్వాదాలు జరిపించి, ఆఖరికి విష్ణువే గొప్ప వేలుపు అని తేలగా రాజు వైష్ణవుడై పోవ

డాన్ని వర్ణించడానికి ఈ వర్ణన భూమికగా చేసుకొన్నాడు రాయలు. సందర్భాన్ని ఇంతబాగా సృష్టించాడీ వర్ణనకోసం.

తర్వాతి వర్ణన :

వర్షరుతువును వర్ణించే ఘట్టంలో రాయలు ఎంతో సహజత్వాన్ని ప్రదర్శించాడు. ఈ ఘట్టంలో ఆయన వర్ణనా పటిమ ఎంతటిదో అందరికీ అర్థం అవుతుంది. ఉత్ప్రేక్షాలంకారాల సొంపు చూడాలంటే ఈ ఘట్టమే చదవాలి. వడగండ్లు పడడం అందరికీ తెలుసు. వర్షధారలముఖంగా అవి ఎట్లా పడుతున్నాయంటే "ఒక చినుకుగూడా పైరుతో వున్న భూమిపై పడనీకుండా ఈ తొలకరి వర్షాన్ని అంతా చాతక పక్షులు తాగేస్తున్నాయే అని (చాతకాలు తొలకరి చినుకులను మాత్రమే భూమిపై పడేముందే తాగుతాయని కవిసమయం.) మేఘుడు తన నోటితో ఊదగా నాళపుటుండలు పడినట్లుగా వడగండ్లు రాలాయని ఉత్ప్రేక్షించినాడు కవి. ఈ వర్ణనతో రుతువర్ణన చేసినట్లూ అయిపోతుంది. వానకోయిలలు తొలకరి చినుకులను పైనుండి పైనే త్రాగేస్తాయి అన్న కవి సమయమూ సిద్ధిస్తుంది. తొలకరిలో వడగండ్లు రాల్తాయీ అన్న స్వభావ చిత్రణా జరుగుతుంది. ఇవన్నీ ఒక్క పద్యంలో సాధించాడు కవి.

ఎంతో పెద్ద భావాన్ని - అంతేగాదు చిన్న కథను సైతం - ఒక్క పద్యంలో ఇముడ్చగల శక్తిగల వ్యక్తి రాయలు. ఇంత యిమిడిక యే కవిలోనూ లేదు. సాధారణంగా పద్య రచనలో ఒక చిన్న భావం చెప్పడానికి పెద్ద పెద్ద సమాసాల భాషను వాడడం కద్దు. రాయలు అదీ చెయ్యగలడు. ఇదీ చెయ్యగలడు.

ఒకే సమాసంలో పద్యాన్ని నడిపించడం చూడండి.

శా. కాంచె న్వైష్ణవు డర్ధయోజనజటాఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచ త్కీటకృత వ్రణచ్ఛలన లిప్యాపాది తాధ్వన్య ని
స్సంచారాత్త మహాఫలోపమ ఫల స్ఫాయద్వటక్ష్మాజమున్.
6-15

ఈ పద్యం మాలదాసరి కథలోనిది. మొట్టమొదటి "కాంచెన్" అన్న శబ్దమూ ఆఖరిలో మున్ అన్న ప్రత్యయమూ మాత్రమే తెలుగు శబ్దాలు. మిగిలిన అంతా పెద్ద సంస్కృత సమాసం. వైష్ణవుడు వటవృక్షాన్ని చూశాడన్నది భావం. అంతే. ఆ చిన్న భావాన్ని చెప్పడానికి నాలుగు పాదాల నిండుకూ సంస్కృత సమాసాన్ని ప్రయోగించాడు. అయితే ఒక్క విషయం. ఇందులో ఎంతో అర్థం యిమిడి వున్నది. ఒక చిన్న కథే చెప్పాడు. చూడండి:- ఆ మాల

దాసరి వటవృక్షాన్ని చూశాడు. అయితే అది ఎలాంటి వటవృక్షం ? బ్రహ్మరాక్షసుడుండే వృక్షం. బ్రహ్మరాక్షసుడు ఎంత వుంటాడు ? చాలా పెద్ద శరీరం గలవాడు. పైగా రాక్షసుడు, క్రూరుడు, మనుషుల తినేవాడు, భయంకరుడు. అంత పెద్ద బ్రహ్మరాక్షసుడు కాపురముండాలంటే అది ఎంత చెట్టుగా వుండాలి? చాలా ఎత్తయినదై వుండాలి. ఆ చెట్టు సామాన్యమైనదిగాదు. దానికి అర్ధయోజనం పొడవు గల ఊడలున్నాయి. వాటి పైభాగాన కొమ్మలున్నాయి. ఆ కొమ్మలకు చిరుకొమ్మలూ, రెమ్మలూనూ. చెట్టునంతా కదిల్చే గాలి వీచింది. ఆ గాలికి పురుగులు తొలిచి వీనులు మాత్రం కనిపించే ఆకులు ఎగిరి దూరంగా బాటసారుల ముందు పడుతున్నాయి. ఆ తొలిచిన భాగాలు ఏదో అక్షరాలు వ్రాసినట్లుగా వున్నాయి. ఆ అక్షరాలేమిటి? ఇక్కడ బ్రహ్మరాక్షసుడు ఉన్నాడు. వాడు మిమ్ముల తినేస్తాడు అని చెప్పినట్లుగా వుంటుంది. అది తెలిసి బాటసారులు దూరంగా తొలిగిపోతారు. ఇంత కథ ఆ పద్యంలో వుంది.

ఒక్క పద్యంలో పెద్దకథ ఇముడ్చగల శక్తిగలవాడు రాయలు అనడానికి మరొక పద్యం :

"తల పక్షచ్ఛద గ్రుచ్చి బాతువులు కే
దారంపు కుల్యాంతర
స్థలి నిద్రింపగ జూచి యారెకులుష
స్స్నాతత్రపయాతద్విజా

వలి పిండీకృత శాటులన్నవి దదా
వాసంబు జేర్వంగ రే
వుల డిగ్గన్వైస బాఱువాని గని న
వ్వున్నాలిగోప్యోఘముల్" 1-65

ఇది విలుబుత్తూరు వర్ణనలోని పద్యం.

రాత్రులు రెక్కల్లో తలలు గ్రుక్కుకొని నిద్రపోయే బాతులను వర్ణించాడు కవి. ఇది చాలా స్వాభావికమైన వర్ణన. ప్రకృతిని ఎంతో పరిశీలిస్తేనే యీ భావం ప్రదర్శించగలరు గాని అన్యథాకాదు. రాజనగళ్ళ పరిసరాలలో వరిమళ్ళు న్నాయి. వాటిని నిత్యమూ చూస్తూవుంటారు రాయలు. వరి మళ్ళకు చిన్నకాలువ లుంటాయి. వాటిల్లో నీరుంటుంది. యిరువైపులా గడ్డి వుంటుంది. బాతులు ఆహారము కోసం తిరిగి తిరిగి విశ్రాంతి కోసం ఆ కాలువల ప్రక్కల్లో గట్లపైన తలలు రెక్కల్లో గ్రుక్కి రాత్రులు నిద్రపోతూ వుంటాయి. అవి తెల్లగా కుప్పలుకుప్పలు లాగ వుంటాయి. బ్రాహ్మణులు చీకటితోనే స్నానాలకు రావడం అందరికీ తెలిసిందే గదా. వాళ్ళు కట్టుబట్టలతోనే స్నానం చేస్తారు. పై పంచగూడా తడిపి దాంతో వళ్ళు తుడుచుకొని మొలకు చుట్టుకొని వెళ్ళి పోతారు. తడిబట్టలను (పంచెలను) ఝాడించి పిండి గట్టు మీద పెట్టి స్నానం చేసిన అనంతరం తీసుకొనిపోయే

అలవాటున్నది గదా! పుర రక్షకులు ఉదయం అలా వచ్చి నపుడు కాలువ గట్లపైన తెల్లగా ముద్దగా వున్న ఆ వస్తువు లేమిటబ్బా అనుకుంటూ ఇవి బహుశా బ్రాహ్మణులు, పిండిన పంచలను గట్టుపైన పెట్టి మరిచిపోయారేమో! తీసుకొని వెళ్ళి అప్పజెబుదాము అని వాటికోసం వంగేటప్పటికి ఆ బాతులు తెలివివచ్చి గబగబా పారిపోయాయి. ఆ దృశ్యాన్ని చూచి, వెన్నుబోయిన వరిమళ్ళను కాయడానికి వెళ్ళిన కావలి కన్యలు నవ్వుతున్నారట. ఇందులో హాస్యరసం వుంది. ఎంతో పెద్ద కథ ఇందులో యిమిడ్చాడని అర్థమవుతోంది గదా! పద్యం గూడా సాఫీగా నడిచింది.

మరొక చోట ఒక పెద్ద కథనే ఒక పద్యంలో యిమి డ్చాడు చూడండి.

శా. విల్లుందానును భిల్లు డొక్క డరుగ,
న్వెందింట దుగ్ధాన్నమున్
భిల్లుం డన్యుడు వెట్ట, నార యుడక
న్వీక్షించి, దొబ్బంచు వా
డెల్ల న్వమ్ముగ జేసి, త న్ననుప రా,
నెందే దెగం జూడగా
నుల్లంబై, 'చన నంపు, నార చెడు' నా,
నూహించి పోనంపడే 4-223

భిల్లులు ఎక్కడికి పోతున్నా విల్లులు పట్టుకొని పోతూ వుంటారు. ఒక భిల్లుడు మరొక భిల్లుడి యింటికి ఆతిథిగా వచ్చాడు. మాంసాహారుల యిళ్ళకు అతిథులు పోతే, మాంసాహారం పెట్టడం అనాదిగా వస్తున్న ఆచారం. ఈనాడు లేదు గాబోలు, పాయసాన్నం వడ్డించాడు అతిథికి. పొయ్యి మీద వేపినార ఉడుకుతున్నది. మూత పెట్టలేదు. అందుచేత ఉడికే వస్తువు కనిపిస్తుంది. ఆనార ఎరుపురంగులో వుంటుంది. కారం వేసి మాంసం ఉడకపెడుతూ వుంటే ఎర్రగా కనిపిస్తుంది గదా. ఆ అతిథి ఆ వుడికే పదార్థం మాంసమని భ్రమపడ్డాడు. అలా అనుకోగానే వాడికి లోపల మంట మండింది. మాంసాన్ని ఉడికిస్తూ, నాకు మాంసం పెట్టకుండా పరమాన్నం పెట్టి పంపుతాడా, రానీ, బయటికి, చంపి పారేస్తాను అని అనుకున్నాడు అతిథి. ఇక వస్తానయ్యా అని బయలుదేరాడు. అతిథిని సాగనంపే ఆచారం వుందిగదా! అందుకు ఆ గృహస్థుడు అతిథితో పాటు కొంత దూరం నడిచాడు. ఇక చంపుదామని అతిథి అనుకుంటూ వుండగా వస్తానయ్యా పొయ్యిమీద నార ఉడుకుతున్నది (ఎక్కువగా వుడికితే చెడిపోతుంది గదా) వుంటాను, అని అన్నాడు. ఆ మాట వినగానే ఆ అతిథి భిల్లుడు అరరే అనవసరంగా చంపుదామనుకున్నానే, ఇదా కథ, అనుకుని సరే ఉండండి, వెళ్ళి వస్తాను అని వెళ్ళి పోయాడు. ఇంత కథ ఆ పద్యంలో

యిమిడ్చాడు రాయలవారు. ఎంతో పెద్ద భావానికి భాష ఇంతగా యిమిడి పోవడం కేవలం రాయల చేతిలోనేగాని, మరేకవిలోనూ ఇంత యిమిడిక వుండదు. అందుకోసం సార్థక పదాలను సమాసంలో కుదించి అవసరమైతే సంస్కృతంలోనుండి పదాలను ఏరుకొని తెచ్చి ప్రయోగిస్తాడు. ఒక్కొక్కసారి అన్వయం చేసుకోడమే కష్టమైపోతుంది. సంస్కృతం ఆయనకు వశమైనంత మరెవ్వారికీ వశంకాదు. మారుమూలల పదాలను, ప్రయోగంలో లేని, ప్రచలితంకాని పదాలనుగూడా ఏరికోరి ప్రయోగిస్తాడు. కవితా ప్రపంచంలో ఆయన అర్థశిల్పి. మరొకకథ చూద్దాం.

రయమున వృష్టికై యొదిగి రచ్చలపై, విధియింతు
రుగ్రతన్
హయపతిమీద దంతిపతి నాతనిపై నృపతింగజాది ని
ర్ణయముల మొత్తులాడుదురు, ప్రమబ్బొక యింతయు
విప్ప విచ్చు మొ
గ్గయి మఱి పాసిపోదురు సమస్తదిశాగతులైన
యధ్వగుల్ 3-131

(ఎంత యెండలోనయినా తట్టుకొని నడుస్తారు కాని) నాలుగు చినుకులు పడితేచాలు మనుషులు పరుగెత్తుతారు. ఇక్కడ వర్షం పడేసరికి దారిలోనడుస్తూ వున్నవారు పరుగెత్తు

కొని వచ్చి రచ్చబండలపైనా, రచ్చ చావళ్ళలోనూ ఒదుగుతారు. ఆ ఒదగడంలోగూడా కొత్తదనం అనే సమస్య ఉదయించదు. అందరూ కలిసి ఒదిగొదిగీ కూర్చుంటారు. కూర్చొని వూరుకుంటారా? లోకాభిరామాయణం మొదలు పెడతారు. (ఈనాడు మనం రైళ్లలో ప్రయాణం చేసేటప్పుడూ, ఇట్లాగే వానకు ఒక్కచోట ఒదిగినపుడూ, వూరుకోం గదా! ఏ పార్టీ గురించో, ఏ పరిపాలన గురించో, ఏ యెలెక్షన్ల గురించో, మరింకేదో ప్రసంగమో చర్చించకుండా వూరుకోముగదా! వాళ్ళకు ఆ రోజుల్లో సామాన్య రాజకీయాలు యుద్ధాల గురించే) రాయలవారి పూర్వీలూ, రాయలూ, అందరూ యుద్ధాల్లో మునిగి వున్నవారే. ఉత్తరంవైపు బహమనీ సుల్తానులూ, ఢిల్లీ సుల్తానులూ నిత్యమూ మతాన్ని వెలయించాలనో, రాజ్యాధికారాన్ని విస్తరించుకోవాలనో తమలోతాము యుద్ధాలు చేసుకుంటూ హిందూ రాజులపై పడుతూ వుండేవారు. సామంతులు, చిన్న చిన్న రాజులూ తమలో తాము కలహిస్తూ, సుల్తానులపై పడేవారు. అటు కళింగరాజులు, దక్షిణంగా నడిచి గోదావరీ కృష్ణా ప్రాంతాల జయిస్తూ యేలుతూ వుండేవారు. అటు వారితో గూడా విజయనగర రాజులకు యుద్ధాలు సంభవిస్తూ వుండేవి. ఇపుడు ఈ వానకు రచ్చలపై చేరినవారు నానా ప్రాంతాల నుండి వచ్చినవారు. అప్పుడు, అశ్వసేన దండిగా వున్నావారు, హయ

పతులు,-అంటే బహమనీ సుల్తానులు. గజసేన ఎక్కువగా గలవారు, గజపతులు, వారు కళింగ రాజ్యాధిపతులు. ఇక నరపతులు- పదాతిసైన్యం అధికంగా గలవారు విజయనగర ఆంధ్ర రాజులు. ఈ చేరినవారు పట్టుదలతో, కొన్ని సార్లు కోపంతో, హయపతికంటే గజపతి, సైన్యంలో గొప్పవాడనీ -కాదు-గజపతి కంటే హయపతి గొప్పవాడనీ,-అదంతా గాదు-వీళ్ళందరికంటే నరపతి గొప్పవాడనీ (పదాతిసైన్యం విజయనగర రాజులకెక్కువ) వాదించుకుంటారు. అదిగూడా చాలా పట్టుదలగా కోపంగా, తీవ్రంగా వాదించుకుంటారు. నీకేం తెలుసు అంటే నీకేం తెలుసునని గట్టిగా వాదించు కుంటారు. కొట్టుకుంటాన్నారేమో అనిపించేట్లుగా వుంటుంది ఆ వాదం. ఇంత తీవ్రంగా వాదించుకుంటూండగా, మబ్బు కాస్తవిచ్చి వర్షం అగిందనుకోండి. ఎవరికి వారు, ఏమియెరగ నట్లు పారిపోతారు.

ఇది చాలా సహజమైన వర్ణన. లోకాన్ని ఎరిగినటు వంటీ, లోకుల ప్రవర్తన యెరిగినటువంటీ, మానవుల పరిస్థి తులూ, ప్రవర్తనలూ, ఎరిగినటువంటీ కవి వ్రాత యిది.

అతిథి సత్కారవేళ ప్రయోగించే ఆదరపు పలుకు లతో, సాంప్రదాయక మార్యాదలతో, వేదనాదాన్ని పురుడించే శయ్యతో, అలరారే ఈ పద్యం చూడండి. ఇందులో ఎంత అర్థముందో చూడండి. ఎంతనాదముందో వినండి.

ఆనిష్ఠానిధి గేహ సీమ నడురే
యాలించిన న్మోశ్రియు నెం
తే నాగేంద్రశయాను పుణ్య కథలుం
దివ్య ప్రబంధానుసం
ధానధ్యానము 'నాస్తిశాక బహుతా'
నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవం చ, కృపయా
భోక్తవ్య, మన్మాటలున్. 1-84

విష్ణుచిత్తుడు గొప్ప విష్ణు భక్తుడు. అగ్రహారీకుడు. తినడానికీ, అతిథులకు పెట్టడానికీ, వున్నవాడు. పెట్టే మనస్సుగలవాడు, భక్తితో పెట్టేవాడు. ఆయన ఇంట్లో పగలేగాదు రాత్రిపూట - అందులో, అర్ధరాత్రిపూట అయినా సరే, ఆతిథ్యపు మాటలు వినిపిస్తూవుంటాయి. ఆ సమయంలో గూడా బంతులు తేస్తూవుంటాయి. అయ్యో, కూరలు అయి పోయాయేమో, ఏమీ అనుకోకండి - రాత్రి అయిపోయింది. వంటలు చల్లారిపోయాయేమో ఏమీ అనుకోవద్దండి. పిండి వంటలు గూడా అయిపోతూ వండవచ్చు. దయచేసి అన్యథా భావించకండి. అన్నం గూడా అంత గొప్పగా వుండక పోవచ్చు. క్షమించండి. దయతో భోంచేయండి అనేమాటలు నిరంతరం వినిపిస్తూనే వుంటున్నాయట.

ఇంత సొంపుగా, సార్థకంగా, సౌష్ఠవ శయ్యా సౌభాగ్యంతో నడిచిన ఈ పద్యం వంటి పద్యం, ఆంధ్ర సారస్వతంలో నూటికీ కోటికీ ఒకటి కనిపిస్తే గొప్ప. రాయల కవిత్వం నారికేళపాకమే - నారికేళం అంటే టెంకాయ. టెంకాయ అరటి పండువలె వొలవడానికి వీలుగాదు! ద్రాక్షవలె తేలికగా చప్పరించడానికి వీలుగాదు. నారికేళాన్ని ముందుగా తాటవలవాలి. తర్వాత ఆ టెంకాయ పగల గొట్టాలి. నీరు తాగాలి. చిప్ప పగులకొట్టి కొబ్బరి తినాలి. అది పచ్చి కొబ్బెర అయినా బాగుంటుంది. అట్లాగే రాయలవారి పద్యాలు చాలా భాగం అంతే. కొంత శ్రమిస్తే గాని స్వారస్యం దొరకదు. ఇతర కదళీ ద్రాక్షా పాకాలు త్వరగా ఆస్వాదయోగ్యాలు. కాని ద్రాక్షా కదళీపాకాలుగూడా రాయల వారి అముక్తమాల్యదలో అధికంగా వున్నాయి. అయినా నారికేళ పాకమే హెచ్చు. లేకపోతే ఈ విలక్షణ పదబంధమే లేకపోతే రాయలవారి కర్తృత్వానికి ఇంకా పెద్దదెబ్బగా వుండేది. దాదాపు యనభై శాతం పద్యాలన్నీ నారికేళ పాకమే. ఇదే రాయలవారి ప్రత్యేకతను అప్రతర్క్యంగా ఒప్పుకోడానికి ఉపకరించే గుణం.

సంస్కృతంలో ఉద్దండ పండితుడైన రాయలు సంస్కృత శబ్దాలను అపరిమితంగా వాడుకున్నాడు. అర్థం

కోసం పాటుబడ్డాడేగాని తాను వేసుకుంటున్న సంస్కృత పదం శ్రావ్యాక్షరమయంగా వుందా లేదా అని అంతగా చూడడు. అందుకే పద్యాలు చాలా భాగం మలవని రాళ్ళతో పెట్టిన సిమెంటు గోడకువలెనే వుంటాయి. అర్థం మాత్రం చక్కగా, ఎంతో భావస్ఫోరకంగా, ఎంతో ఇమిడికగా, ఎంతో కథాత్మకంగా వుంటుంది. విస్తృతార్థాన్నిచ్చే పదాన్ని ఏరి, అలాంటి అర్థాన్నిచ్చే పదాలతో సమాసం కూర్చి యినుప గుగ్గిళ్ళు నమిలిస్తాడు రాయలు.

ప్రౌఢకవితా పూర్ణమయిన ఆముక్తమాల్యద ఆంధ్ర కవితాలోకానికి తలమానికం. సర్వంకష పాండిత్య ప్రకర్షను చాటాలంటే ఆముక్తమాల్యదలోని పద్యాలను ముప్పాతికా మువ్వీసం ఉదాహరణలుగా చూపాల్సి వుంటుంది. ఒక్కసారి ఈ క్రింది పద్యాలు చూడండి. అర్థమూ ఔద్ధత్యమూ ఎలా పెనవేసుకొని వున్నాయో.

సీ. ఖ నట త్పయోబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య
పిండీకృ తాంగ భీతాండజములు,
ధృత కులాయార్ధ ఖండిత సమి ల్లవరూప
చరణాంతికభ్రమ త్తరువరములు,

ఘన గుహా ఘటిత ఝూంకరణ లోకైక ద్వి
దుందుభీకృత మేరు మందరములు,
చటుల ఝంపా తర స్స్వ నగరీ వివరీత
పాతితాశాకోణ పరిబృఢములు,

ప్రబలతర బాడబీకృతేరమ్మదములు
భాస్వరేరమ్మదీకృత బాడబములు
పతగ సమ్రాట్పతత్ర ప్రభంజనములు
వృజినతూలౌఘములదూల విసరుగాత.

పై పద్యంలోని పిండీకృతాంగ భీతాండజములు, చరణాంతిక భ్రమత్తరువరములు, దుందు భీకృత మేరు మందరములు, పాతితాశాకోణ పరిబృఢములు, బాడబీకృతే రమ్మదములు, భాస్వరేరమ్మదీకృత బాడబములు, పతత్ర ప్రభంజనములు వృజినతూలౌఘములు అన్న సమాసాల చూచినపుడు మనకు ఆనందాశ్చర్యాలు కలిగి తీర్తాయి. ఉత్ప్రేక్ష, రూపక, అతిశయాక్త్యలంకారాలు స్వభావోక్తుల సమన్వితాలుగా అక్షర రమ్యంగా మహదర్థ స్ఫోరకంగా రమ్యాలంకృతంగా ఊపుగా, ఠీవిగా, నడిపించే నడక, శౌర్యధైర్య సాహ సౌదార్య గుణ సంపన్నుడయిన మహారాజకవి రాయల వారికే చెల్లును. ఓజోగుణ ప్రధానమైన ఇలాంటి పద్యాలు ఆముక్తమాల్యద నిండా

కోకొల్లలు (గరుడని రెక్కల విసుర్లనుండి ఉత్పన్నమయ్యే మహామారుతం పాపాలు పోగొట్టుగాక అని అర్థం)

స్యందనస్థితబిడౌజః క్షత్త్రజాడ్యకృ
ఝంఝామరుద్గరుఝాత్కృతములు
క్రవ్యాశిరాడ్గాత్రకనదస్ృగ్గాహన
స్ఫుటశల్య హవ్యభుక్ఛాత్కృతములు
యోధవర్మితహృత్పుటోత్క్రాంతనిజపాత
సాలాశ్మకృతముహుష్ఠాత్కృములు
పతితోగ్రరక్షః కబంధభారభృశార్తి
భుగ్నభోగఫణీంద్రపూత్కృతములు

తే. శ్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు
దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు
కలుషము లడంచుగాత లంకాపురాంగ
ణాంబరచలత్కలంబకదంబకములు. 4-27

పై పద్యంలో భావం యేమిటి ? రాముడు ఇంద్రుడిచ్చిన రథంపై నుండి బాణాలు ప్రయోగిస్తూ వుంటే వాటి వేగానికీ, దెబ్బకూ కలిగిన తీవ్ర ఫలితాల వర్ణన. ఇందులో కనిపించే ఝాత్కృతములు, ఛాత్కృతములు, అర్థంతో కూడిన ధ్వన్యనుకరణ శబ్దాలు. వర్ణితవస్తువు యొక్క స్వరూప

స్వభావాలు ఈ శబ్దాల్లో ప్రతిబింబితాలు. ఇలాంటి ప్రయో గాలు రాయలవారు ఎన్నయినా చేయగలరు.

వసంతర్తు వర్ణనలోని ఈ క్రింది పద్యాన్ని చూడండి.

మదనస్యందనతా స్వవృత్తి దెలిపెం,
బాటీర భూభృద్వల
న్మృదువాతం బతిపక్వ పాదవ లతా
వృంతావళీ మూల రం
ధ్రదళ త్పంకజకర్ణికాగణ హరిద్రాభంగభాభాసుర
చ్ఛదన చ్ఛద్మవివర్తి కాంచన కనచ్చక్రచ్ఛటాచే
తృకృతిన్. 5-108

ఇలా యెన్నో పద్యాలు ఉదాహరింపవచ్చును. వాటి అర్థాలు చాలా మనోహరంగా, అద్భుతావహంగా వుంటాయి. కాని వివరించడానికిక్కడ వీలుపడదు. పేజీలు పేజీలు చెప్పవలసి వుంటుంది. వాటి అందాన్ని చూడమన్నామేగాని వేరొండు గాదు.

వేదాంతాన్ని తర్కసహితంగా చెప్పడమూ, అందులో గూడా వాఙ్నైపుణ్యాన్ని ప్రదర్శించడమూ రాయలవారికే చెల్లు. ఈ గ్రంథంలో కొన్ని కథలున్నాయి.

1. విష్ణుచిత్తుడు మధురాపురికి పోయి అక్కడ రాజాస్థానంలో వాదించి విష్ణువే పరమ వేలుపు అని నిర్ధారించుట. (ఇక్కడ విష్ణుభక్తి పారమ్యం-విష్ణుమహిమ, ప్రదర్శితాలు.)

2. మాలదాసరి కథ : మాలదాసరి సామాజికంగా అంటరానివాడు, మహా విష్ణుభక్తుడు. అందుకని అతనికి గర్వం లేదు. దేవాలయం వెళ్ళి ప్రహారీ అవతలే వుండి కైంకర్య కీర్తనలు పాడి శూద్రుడు ఎత్తిపోసిన తీర్థం త్రాగి తృప్తిగా వుంటాడేగాని, అంత భక్తుణ్ణి గదా అని అతిశయించడు. బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టులో వున్న బ్రహ్మరాక్షసుడికి పట్టువడి వాడితో పెనగి ఓడిపోయి, వానికాహారం అవడానికి సిద్ధపడి ఆఖరికి విష్ణు దేవాలయం వెళ్ళి ఆఖరిసారిగా ప్రార్థనచేసి వస్తానని నమ్మబలికి వాడు నమ్మకపోతే విష్ణువు తప్ప మరొక దేవుడు మహిమ గలవాడు 'అన్న పాపానికి పోగలను' అని ఒట్టు వేసుకొని కైంకర్యం తర్వాత తిరిగివచ్చి నన్ను ఇక తినవచ్చు అనగా, ఆ బ్రహ్మరాక్షసుడు అతని కాళ్ళపై పడి నీ విష్ణుభక్తివల్ల సాధించిన పుణ్యఫలం కొంత నాకోసం ఖర్చుపెట్టి నా యీ బ్రహ్మరాక్షస జన్మను పోగొట్టుమని ప్రార్థించగా, మాలదాసరి ఒప్పుకోకపోవడమూ ఆఖరికి ఈనాటి పాటలోని ఆఖరి పాదంవల్ల కలిగే పుణ్యాన్నయినా ధారవోసి నాకీ జన్మవిముక్తి కలిగించుమని ప్రార్థించగా, మాలదాసరి బ్రహ్మరాక్షసుని కరుణించి ఆ

ఫలాన్ని అందీయగా వాడు బ్రహ్మరాక్షసత్వంనుండి విముక్తి పొందిన కథ (ఇది గూడా విష్ణుమహిమను గూర్చి చెప్పేదే.)

3 రాయలే విష్ణుభక్తుడు. ఆయన పూర్వదిగ్విజయ యాత్ర వెళ్ళినపుడు శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువును దర్శించి ఆయన తన కలలో కనిపించి "ఆముక్తమాల్యదను రచించి జన్మసార్థక్యమును పొందుము, తెలుగులోనే వ్రాయుము" అని ఆజ్ఞాపింపగా ఆముక్తమాల్యద రచియించినట్లున్న కథ. (ఇది గూడా విష్ణుభక్తి మహిమను చెప్పేదే.)

4. ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానం : ఇది రాయలవారి ప్రజ్ఞకూ, ప్రతిభకూ మేలుకట్టు. ఇది విష్ణుచిత్తుడు పాండ్య రాజు ఆస్థానంలో చెప్పిన కథ. ఖాండిక్యుడు, కేశిధ్వజుడు అనే రాజులు చిన్నాన్న పెదనాన్న బిడ్డలు. రాజ్యంకోసం యుద్ధం చేస్తారు. కృతధ్వజుని కొడుకయిన కేశిధ్వజుడు గెలుస్తాడు. మితధ్వజనందనుడయిన ఖాండిక్యుడు ఓడిపోయి పారిపోతాడు. అరణ్యాల్లో జీవిస్తూ వుంటాడు. రాజ్యం వచ్చింది గదా అని తృప్తిపడక కేశిధ్వజుడు "అవిద్యనూ మృత్యువునూ గెలవాలని యజ్ఞయాగాలు చేస్తూ వుంటాడు. ఒకసారి తాను యజ్ఞదీక్షలో వుండగా యాగధేనువును పులి చంపుతుంది. యజ్ఞానికి విఘ్నం జరుగుతుంది. దానికి ప్రాయశ్చిత్తంకోసం ఎందరిని అడిగినా సరిగా చెప్పలేదు. ఆఖరికి

ఈ కేశిధ్వజుడు, అవన్నీ తెలిసిన ఖాండిక్యుని దగ్గరికి పోతాడు. అతడు ప్రాయశ్చిత్తం సూచిస్తాడు. యజ్ఞం నెరవేరుతుంది. గురుదక్షిణ తీసుకోవలసిందని కేశిధ్వజుడు ఖాండిక్యుని బలవంత పెడతాడు. ఒప్పుకోడు. ఇరువురూ శాశ్వతమూ, అశాశ్వతమూ, ఆత్మా, అనాత్మ మొదలయిన విషయాలపై వేదాంతచర్చ చేస్తారు. మోక్షమునందుకోవడానికి ప్రతిబంధకం కలిగించేది మనసే అనీ, దాన్ని అదుపులో పెట్టుకోవాలనీ నిర్ణయిస్తారు. నిష్కామకర్మ ప్రధానం అన్నారు. భక్తియోగం ప్రధానమన్నారు. విష్ణువే పరతత్త్వం గాబట్టి విష్ణువునే ధ్యానించితే మోక్షం వస్తుందన్నారు. ఈ విధంగా చర్చజరిగినతర్వాత,సారాంశం తేలినాక, కేశిధ్వజుడు పట్టుబట్టి గెల్చుకున్నరాజ్యాన్ని బలవంతంగా ఖాండిక్యునికి అంటగట్టగా అతను తన కొడుకుకు పట్టంగట్టి విష్ణునామ స్మరణలో శేష జీవితాన్ని గడుపుతాడు. కేశిధ్వజుడు గూడా తన పట్టణం వెళ్ళి తన కుమారుడికి పట్టంగట్టి తాను గూడా విష్ణుభక్తుడై శేషజీవితాన్ని గడుపుతాడు, అని విష్ణుచిత్తుడు మధుర సంస్థానంలో అనగానే శుల్కమూల్యంగా వుంచిన డబ్బు సంచి తటాలున తెగి క్రింద పడుతుంది. విష్ణుచిత్తుడు గెలిచినట్లయింది. ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానంలో రాయలు ప్రదర్శించిన ప్రతిభ పతాక స్థాయినందుకొంది. ఎన్నివేదాంత విషయాలు! ఎన్ని ధర్మసందేహాలకు జవాబులు! ఎన్ని

ధర్మశాస్త్రాలపై వాదనలు ! ఎంతలోకజ్ఞత. ఇది గొప్పయోగ గ్రంథం అనవచ్చు. ఇంత ధర్మపాండిత్యంతో కథ నడిపిన అనంతరం, విష్ణువే పరమవేలుపు అని నిర్ణయం జరిగిన అనంతరం, సభఎట్లా అయిందో రాయలు బ్రహ్మాండంగా వర్ణిస్తాడు. అందులో ప్రయోగించిన పదజాలం, రచనా విన్యాసం హుందాతనం తిలకించండి.

అద్ధావాగ్విబుధం, బహోవచన కవ్యాహార, మాహావచ
స్సిద్ధం, బాఃకృతతాం గతః కలి రితి శ్రీసూక్తి
విద్యా ధరం
బిద్ధౌద్ధత్య మగా ల్లయం హి కుధియా మిత్యన్నద
త్కిన్నరం
బద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునందయ్యె న్సభం
బంతయున్.

విబుధులంతా సరిసరి అంటూవుండగా పితృదేవతలు అహో అహో అంటూవుండగా, ఆహా ఆహా అని సిద్ధులంటూ వుండగా, ఆహా కలియుగం కృతయుగమై పోయినట్లుందే అని విద్యాధరులంటూ వుండగా, దుర్మార్గుల పొగరణగిపోయింది గదా అని కిన్నరులు ఆనందిస్తూవుండగా, అకాశమంతా ఆనందతుందిలం అయింది గదా - ఆ విష్ణుచిత్తుడు గెలిచి నప్పుడు, అని ఎంతబాగా వ్రాశాడో చూడండి. ఇది దుష్కర

ప్రాసతో కూడుకున్న పద్యం కేవలం తెలుగు ప్రత్యయాలు మాత్రమే గల సంస్కృత సమాసాలు వేదమంత్రంలాగా సాగడం అద్భుత విషయం. ఈ కవి పాండిత్యానికి మేర అంటూలేదు. పటపట మని చినుకుల వరుసలు రాలినట్లుగా, సరసరమని పుంఖాను పుంఖంగా బాణాలు దూకినట్లుగా సంస్కృత పదాలు కవిత్వంలో దూకుతాయి రాయలుకు.

5. యామునాచార్య కథ ఇట్టిదే. విష్ణువే లక్ష్మీదేవితో ఇపుడీ విష్ణుచిత్తుడు నా మతాన్ని ఉద్ధరించాడు. అపుడు యామునాచార్యుడు ఉద్ధరించాడు అని అనగానే ఆమె ఎవరా యామునాచార్యుడు అని అడుగుతుంది. విష్ణువు కథ చెబుతాడు.

"ఈనాటి పాండ్యరాజు పూర్వుడొకరాజు నాభక్తిని విస్మరించి వెర్రిశైవము ముదిరి అశ్రాంతమూ జంగమార్చనలో మునిగి వుండేవాడు. ఆ రాజమహిషి మాత్రం వైష్ణవి.

ఈ సమయంలో యామునాచార్యుడు రాణిని సమీపించి రాజు మనసును మారుస్తాను అంటాడు. ఆమె ఆమాట రాజుతో అంటుంది. రాజు నవ్వి యామునాచార్యునితో

'సంగతియె యోయి, యిసుమంత లింగణావు,
తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు ?
నోడితేనియు బట్టి, మొట్టో యనంగ
లింగమును గట్టి కుడుగ, నెఱింగి నొడువు.' 4-60

అంటాడు. ఇక్కడ ఎంత తిరస్కారం. ఎంత అవహేళన. అయితేనేమి యామునాచార్యుడు సరే అని ఢీకొంటాడు పండితులను.

ఇక్కడ రాయలవారు తన వాదనాపటిమను తర్కాన్ని ఎంతబాగా ప్రయోగించాడో ఈ క్రింది పద్యంలో చూడండి. ఇదే పద్యం విష్ణుచిత్తుడు పాండ్య నగరంలో వాదించినపుడు గూడా కనిపిస్తుంది. (ఆ. 3-6)

అందులో నొకమేటి కభిముఖుండై యాత
　　డనిన వన్నియును ము న్ననువదించి
తొడగి యన్నిటి కన్నిదూషణంబులు వేగ
　　పడక తత్సభ యొడబడగ బల్కి
ప్రక్కమాటల నెన్న కొక్కొకమాటనె
　　నిగ్రహస్థాన మనుగ్రహించి,
క్రందుగా రేగిన గలగ కందఱ దీర్చి
　　నిలిపి యమ్మొదలివానికినె మగిడి;
మఱి శ్రుతిస్మృతిసూత్రసమాజమునకు
　　నైక్యకంఠంబు గల్పించి, యాత్మమతము
జగమెఱుంగగ రాద్ధాంతముగ నొనర్చి;
　　విజేతుగావించి దయ వాని విడిచిపెట్టి 4-71

"నీవేమంటివి రమ్మం"
చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి, యొకడొకడు రా
నావిప్రుడు వాదసరణి నందఱ గెలిచెన్.

యామునుడు గెలవడమూ రాజోడిపోవడమూ, రాజు వైష్ణవమతం స్వీకరించి తన చెల్లెలిని యామునునకీయడమూ, అతడు రాజై వర్షర్తుశరదృతువులు జరిగిపోగానే దండయాత్ర చేసి గెలిచి రాజ్యం చేస్తూ వుండగా యామునుని తాతగారగు నాదముని ప్రశిష్యుడైన శ్రీరామమిశ్రుడు యామునాచార్యుని భోగజీవితము నుండి మరల్చి విష్ణుకైంకర్యంలోనికి దించాలని వచ్చి, దర్శించి ప్రతిరోజూ అలర్క-శాకముతో కూరలు వండించి వడ్డించునట్లు చేసి ఆఖరికి యామునాచార్యుని శ్రీరంగ శాయి దర్శనం చేసుకొనేట్లట్లు చేసి మరలా విష్ణుభక్తునిగా మార్చినాడు. ఈ కథద్వారా రాజ్యాలు గెలువడమూ, రాజనీతి వైశద్యమూ తెలియజేయడం జరిగింది. రాయలవారి వైష్ణవ భక్తీ, రాజనీతీ, సువ్యక్తం కావడమూ జరిగింది.

ఆరవది అసలు కథ. జనక చక్రవర్తికి దున్నుతూ వుండగా నాగేటి చాలులో సీత దొరికినట్లుగా, విష్ణుచిత్తునికి పూలవనంలో గోదాదేవి దొరుకుతుంది. ఆమెను పెంచి పెద్ద చేసాడు. ఆమె యౌవనవతి అయింది. ఇక్కడ ప్రబంధోచిత

నాయిక విరహాలూ ఉపాలంభనలూ, మొదలయినాయి. వసంతరుతువు ఇక్కడ వర్ణితము. నాయికా విరహమూ ఆమె అగచాట్లూ వర్ణింపబడ్డాయి. ఆమె బాధలు బ్రహ్మచారి అయిన విష్ణుచిత్తుడికి అర్థంకాక అదేమి తపస్సో అనుకుంటాడు. విష్ణువు ఆలయానికి వెళ్ళి గోదాదేవి అవస్థ చెప్పుకుంటాడు. ఇక్కడ ఈః ప్రయోగించిన వచనం (5-15) మనోహరం. దేవుని పూజ ఒకవైపు, ఆమె విరహతాప మొకవైపు ఒకే పరిస్ఫురించే విధంగా గొప్ప నేర్పుతో వర్ణించారు రాయల వారు.

ఆఖరికి శ్రీరంగంలోని శ్రీరంగనాథుని సేవకై విష్ణుచిత్తుడూ, గోదాదేవి వెళ్ళిపోతారు. అక్కడ స్వామిని విష్ణుచిత్తుడు పూజిస్తాడు. శ్రీరంగనాథుడు గోదాదేవిని చూచి మనసుపడి ఆమెను తన యంతఃపురంలో దాచుకున్నాడు. విష్ణుచిత్తుడు యేడ్చి మొత్తుకొని, అందరికీ శ్రీరంగనాథుడు చేసిన పని చెప్పుకొని పరిదేవనం గావించాడు. రంగనాథుడు నవ్వుకొని ఆ గోదాదేవిని వెంటనే తన తండ్రి విడిదిలో ప్రత్యక్షమయ్యేటట్లు చేశాడు. తర్వాత బ్రహ్మను, శివుని, సరస్వతిని, పార్వతిని విష్ణుచిత్తుని యింటికి పంపి, అడిగించి, గోదాదేవిని వివాహము చేసుకున్నాడు. అంతటితో ఆముక్త మాల్యద కథ మంగళాంతగా ముగిసింది.

ఈ ఆరు కథలను రాయలు నడిపిన తీరు అమోఘ ప్రజ్ఞావిలసితము. గ్రీష్మవర్షశరద్వసంత రుతువుల వర్ణించిన తీరు అతివేలభావుకతా ప్రదర్శితము. రాయలు తనదైన ప్రత్యేకతను ప్రదర్శించిన రచన యిది.

శ్రీకృష్ణ దేవరాయలు ఆముక్తమాల్యద రచన ద్వారా ఆయన పాండిత్యాన్ని ప్రదర్శింపదలచారు. ప్రదర్శించారు. ఆయనకు ముందుగానీ, ఆయన కాలంలో గానీ ఆ తర్వాత గానీ, ఏ కవీ వాడజాలని పదాల ప్రయోగించాడు రాయలు. అంతా సంస్కృతమయం, ఆముక్తమాల్యద. ఆయన మహా భావుకుడు. తన భావ విన్యాసానికి అనుగుణమైన సంస్కృత పదాలను, సార్థక పదాలను ప్రయోగించాడు. అల్లసాని పెద్దన, భట్టుమూర్తి మొదలయిన వారు సంస్కృత పదాలను విరివిగా వాడారు. అయితే వారు తాము ప్రయోగించే పదంలో సార్థకతా అక్షరరమ్యతా వుందా లేదా అని చూచేవారు. అందుకే వారి కవిత కొంత సరళంగా కనిపిస్తుంది. సార్థకత పేరుతో మారుమూల పదాలను వారు వాడలేదు. సంగీత యుక్తంగా వుండకపోతే వాటిని పరిహరించి వేరే పదాలను పట్టుకొన్నారు. కాని రాయలు సార్థకపదం అని తోచిన ఏ మారుమూల పదమైనా సరే, ముడి రాయిలాగా వున్నా సరే, దాన్ని వాడారు. అందుకు చాలా పద్యాలు ముడిరాళ్ళలాగా,

అర్థాన్ని చూస్తే పిడిరాళ్ళలాగా కనిపిస్తాయి. ఎంత పండితు డైనా వ్యాఖ్యానం కొద్దిగానయినా చూడందే అర్థం చేసుకోడం కష్టమనిపించే విధంగా వుంటుంది కావ్యం. అలాగని సంగీత యుక్తంగా వుండదా అంటే, వుంది. చాలాపద్యాలు ఆ విధంగా వున్నాయి గూడా. అంతేగాదు, వేదనాదం లాగే ధ్వనించే పద్యాలున్నాయి. విష్ణుచిత్తుని యింటి వాతావరణ వర్ణనలో పద్యం చూడండి. వేదాన్ని చదివినట్లు చదవండి.

ఆనిష్ఠానిధిగేహసీమ నడురే యాలించిన
నోం క్రియు నెం
తే నాగేంద్రశయానుపుణ్య కథలుం
దివ్యప్రబంధానుసం
ధానధ్వానము 'నాస్తిశాకబహుతా' నాస్త్యుష్ణతా,
నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవం చ, కృపయా భోక్తవ్య,
మన్మాటలున్ 1-84

విష్ణుచిత్తుడు వాదంలో గెలిచి విష్ణువే పరతత్వం అని తేల్చి నప్పటి పద్యం చూడండి.

అద్ధావాగ్విబుధం, బహోవచన కవ్యాహార, మాహోవచ
స్సిద్ధం, బాఃకృతతాంగతః కలిరితి శ్రీ సూక్తి
విద్యాధరం

బిద్ధౌద్ధత్య మగాల్లయం హి కుధియా మిత్యున్నద
త్కిన్నరం,
బద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునందయ్యె న్నభం
బంతయున్. 4-6

వేదనాదం లాగా లేదా? ఇంకా చూడండి.

విలుబుత్తూరు వర్ణనలో

లలితోద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానము
ల్వాలభీ నీల హరిన్మణీ పికశుక స్వానభ్రమంబూన్ప మి
న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుంజూడ
జెన్నొంది శ్రీ
విలుబుత్తూరు సెలంగు బాండ్య నగరోర్వీ
రత్నసీమంతమై. 1-51

విలుబుత్తూరు వర్ణనలో మన్నారు కృష్ణస్వామి పూజా వేళలో భేరీని వాయించడమూ, హంసలు ఎగిరి గూండ్లకు బోవడమూ వర్ణించే పద్యం ఈ క్రిందిది.

సాయంకాలములం దదీశ మురజి త్సద్మస్వనద్దుందుభి
స్ఫాయత్కాహళికాప్రతిస్వనత దోప స్గుంజ
గర్భంబుల

న్మోక్రియుం గేలివనిం గులాయ గమన ప్రోత్థిష
దస్త్రస్సర
స్థాయి శ్వేతగరు ద్గరుత్పటపటాత్కారంబు
గ్రేంకారమున్ 1-72

ఆ మహావిష్ణువు విష్ణుచిత్తునితో నీవు మధురకు పోయి రాజుగారి ఆస్థానంలో వాదించమన్నప్పుడు విష్ణుచిత్తుని జవాబు.

స్వామీ, నన్ను, నితఃపురాపఠితశాస్త్రగ్రంథ
జాత్యంధు, నా
రామక్ష్మాఖనన క్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు, న్భవద్భవనదాసు, న్వాది
గాబంపుచో
భూమీభృత్సభ నోటమైన నయశంబు మీకు
గాకుండునే ?

(నేను ఆట్టే చదివినవాణ్ణి గాను. రాజసభలో వోడిపోతే అపయశం నీకుగాదా అంటాడు విష్ణుచిత్తుడు)

పై పద్యాలన్నీ శార్దూలమత్తేభాలు. వాటినడకే గొప్ప ఊపూ తూగూ గలవి. ఉదాత్త, అనుదాత్త స్వరిత దీర్ఘ ప్లుత ములను జోడించి చదివితే వేదనాదం వలె వుంటుంది. అలా చదివి చూడండి.

రాయలు రాజనీతికుశలుడని ప్రతీతి. ఆముక్తమాల్య దలోని యామునాచార్యుని రాజనీతి రాయల వారి రాజనీతే.

రాయలు ఎన్నో గ్రంథాలు పఠించినవాడు. భారత భాగవతాదులే గాక, సంస్కృతంలోని అన్ని కావ్యాలనూ పఠించడం మాత్రమేగాక వేదవేదాంగవిదుడు గూడ. సంస్కృతంలో వున్న గ్రంథాలలోని రాజనీతి, చాణుక్యుని రాజనీతి వివిధ స్మృతులు, అంటే ధర్మశాస్త్రాలు, చదివినవాడు. ఒంటబట్టినవాడు.

ఈయన రాజనీతిలో ముఖ్యమైనది విప్రముఖ్యత. బ్రాహ్మణులకు అధిక ప్రాధాన్య మిచ్చిన వాడీయన. బ్రాహ్మణుడే మంత్రిగా వుండాలని వ్రాసినవాడు. మహామంత్రి తిమ్మరుసు బ్రాహ్మణుడే గదా. చాతుర్వర్ణ్య రక్షణ, చాతుర్వర్ణ్య పాలన రాజులకు ముఖ్యమని విశ్వసించినవాడు. రాజకీయంగా విశ్వసింపక తప్పదు గదా. అంతే గాదు. ఆనాటి కవులు, ఆస్థానగురువులు (అంతకు ముందటివారు గూడా) రాజును నావిష్ణుః పృథివీ పతిః" అని పొగిడారు. ఆముక్తమాల్యదలోని రాజనీతి చెప్పిన పరిపాలకుడు, యామునాచార్యుడు. బ్రాహ్మణుడు. నృప శాస్త్రము, శుక్రనీతి, చాణక్యనీతి, కామందక నీతి, ఇంకా ఎన్నెన్నో ధర్మశాస్త్రాల సారం, యామునాచార్య రాజనీతిలో కనిపిస్తుంది.

భూపతి ఆజ్ఞకు ఎల్లరూ తల్లడిల్లేలా వుండాలి. దుర్గ పాలన ఆప్తులైన బ్రాహ్మణుల చేతిలోనే వుంచాలి. వారి అధీనంలో ఎక్కువగా సైన్యం వుంచాలి. వాళ్ళు మరీ మద మెక్కి పోకుండా వుండేలా చూచుకోవాలి. మొదట గొప్పగా గౌరవించి, తర్వాత గౌరవాన్ని తగ్గించడం తగదు. కాబట్టి శీలాన్ని గమనించి వారికి ఆధిపత్యం యివ్వాలి. బ్రాహ్మణు డన్నాం గదా అని ఎవణ్ణంటే వాణ్ణి నియమించగూడదు. ఉత్తమ వంశజుడు కాని వానిని బోయపల్లెల్లో నివాసంవుండిన వాణ్ణి, బాగా చదవనివాణ్ణి, బొంకులు పలికేవాణ్ణి, ఆకతాయిని గడుసువాణ్ణి బ్రాహ్మణుడైనా సరే వదిలివెయ్యాలి.

ఎటువంటివాడు మంత్రిగా వుండాలి? ఏబదియేండ్ల పైబడి, డెబ్బదికి లోబడిన బ్రాహ్మణుడుగ వుండాలి. పదవీ వ్యామోహంగలవాడు పనికిరాడు. రాజు ప్రార్థన ననుసరించి మంత్రి పదవి చేపట్టేవాడుగా వుండాలి. అటువంటివాడు దొరకకపోతే రాజే స్వయంగా అన్నీ చూచుకోవాలి. బ్రాహ్మ ణుడుగదా అని ఎవర్నిబడితే వారిని మంత్రులుగా వేసుకో రాదు గూడా.

ఇదంతా రాయలవారి అనుభవం. వారి పూర్వుల అనుభవం. అందుచేతనే ఇంత చెప్పాడు మంత్రి పదవి గురించి. ఎటువంటిపని అయినా ఒకరికి బదులు నలుగుర్ని

నియోగించాలి. బ్రాహ్మణునే ఎందుకు మంత్రిగా వెయ్యాలి? అంటే, క్షత్రియులు, వైశ్యులూ, శూద్రులూ నవ్విపోతారేమో అన్న భయంతో జాగ్రత్తగా చేస్తారని. అడవి జాతుల నుండి తిరుగుబాట్లు సంభవిస్తాయేమోఅన్న భయం వున్నపుడు ఆ సరిహద్దు ప్రాంతాలను సరిహద్దు యోధులకు అప్పజెప్పాలి. వాళ్ళిరువురు కొట్టుకోనీ యేమైనాగానీ రాజుకు నష్టంవుండదు. ఇది గొప్ప రాజనీతి.

గుర్రాలను, ఏనుగులను, మంచిగా నమ్మిన భటుల స్వాధీనంలోనే వుంచాలి. అధికారులకు వదలగూడదు.

జీవనంకోసం ఉద్యోగం చేస్తారు గాబట్టి, వారికి రాబడి తగ్గకుండా చూడాలి. లేకపోతే వాళ్ళు రాజు చెడుగు కోర్తారు. తిరుగుబాటు చేస్తారు. ఆ స్థితికి రానీగూడదు. ఒకవేళ అలాంటిది సంభవిస్తే వారిని కొలువు నుండి తీసి పారెయ్యకుండా, కొలువులోనే ఉంచి జాగ్రత్తగా కనిపెడుతూ వుండాలి. (ఈ సూత్రం ఈనాటికీ అవసరమే).

పాలిత భూమి ఎంత విస్తీర్ణం వుంటే అంత ఆదాయం. చెరువులు, కుంటలు, నీటికాలువలూ నిర్మించి వ్యవసాయం అభివృద్ధి చెయ్యాలి. పేదలకు పన్ను తగ్గించాలి. దాని చేత వ్యవసాయం వృద్ధిపొందుతుంది. అది రాజుకు లాభమే గదా. (కప్పం ఎక్కువ వస్తుంది).

వచ్చే ఆదాయాన్ని బాగా లెక్కించి, అందులో ఒక భాగం మాత్రం స్వానుభవానికీ త్యాగానికీ ఖర్చు పెట్టవచ్చు. సైన్యంకోసం రెండు భాగాలు ఖర్చు చెయ్యాలి. మిగిలిన భాగం బొక్కసానికి పంపాలి. ఈ విధంగానే చెయ్యాలి. దొంగలుంటే తునుమాడాలి.

ఆ రేకులను జాగ్రత్తగా చూచుకుంటూ వుండాలి. రాజు చారచక్షువుగా జాగ్రత్తగా వుండాలి.

రాజు ఎంతో మెలకువగా వుండాలి. చెట్టుపైన పడుకొని నిద్రపోతూ భల్లూకం యేవిధంగా అయితే ఒక కన్నుమూసికొని మరొక కన్ను తెరిచివుంటుందో, రాజు అంత జాగరూకుడుగా వుండాలి. (భోగాలు అనుభవించేతటి)

సన్యాసులకు అగ్రహారాదులూ ఈనాములూ యీఁగూడదు. గుఱ్ఱాలూ, యేనుగులూ, చందనాలూ, రత్నాలూ ముత్యాలూ తాముండే స్థానానికే వచ్చేటట్టుగా వర్తకాన్ని పెంచుకోవాలి. రేవులను మన స్వాధీనంలో వుంచుకోవాలి. (పోర్చుగీసువారు గుఱ్ఱాలను విజయనగర రాజులకే ఇచ్చేటట్టు ఒడంబడిక చేసుకొని వున్నారు).

రాయలవారు అనుసరించిన మరొక రాజనీతి వుంది. సైన్యాలను తరలించుకొనిపోతూ వుండాలి. మరొక చోటికి

పంపిన తమ సైన్యం, తమతో కలిసేలాగా నిదానంగా దండ యాత్ర నడవాలి. అంతా కలిసి బలంగా తయారయ్యాక శత్రురాజు బలవంతుడై రాయబారం సాగిస్తే అతని సత్కారానికి సంతోషపడి వెనక్కి తిరిగి రావడం మంచిది. బల హీనుడయితే, పైన పడి స్వాధీనం చేసుకోవాలి. ఇది ఆయన యిరవై ఒక్క సంవత్సరాలు రాజుగా చేసిన పని.

రాయలు యువకుడుగా వున్న రోజులలో విజయనగర సామ్రాజ్యంలోనూ, చుట్టుపట్లా గూడా అశాంతి వుండేది. తిరుగుబాట్లు అణచివెయ్యడానికి రాయలు గూడా సేనాధిపతిగా పంపబడుతూ వుండేవాడు. ఆయన తండ్రి కాలంలో తన అన్నగారి కాలంలో గూడా రాయలు దండయాత్రలలో పాల్గొంటూ వచ్చాడు.

కృష్ణదేవరాయలు రాజయిన తర్వాత లోగడ గడించిన అనుభవాన్ని అమలులో పెట్టాడు. అంటే శత్రువుల నెట్లా దెబ్బతీయాలో, ప్రజలను ఎట్లా పరిపాలించాలో అవన్నీ అమల్లో పెట్టాడు. యామునాచార్యుని రాజనీతిలో ఏమేమి చెప్పబడ్డాయో అవన్నీ రాయలు అమల్లో పెట్టినవే.

రాజంటే దైవాంశసంభూతుడు అని గదా! భోగలాలసత వారి జన్మహక్కు. రాజుల దైనందిన చర్యల్లూ, వారి ఆహారమూ రాయలు వర్ణించిన విధం చూద్దాం. ప్రాతః

కాలమే సౌఖశాయనికులు (సుఖంగా నిద్రపోయారా అని అడిగే వారు). వైద్యులూ, రాజును దర్శించాలి. తర్వాత బ్రాహ్మణులు దర్శించాలి. వారితో రాజు కాసేపు సల్లాపాలు ఆడాలి. జాము ప్రొద్దెక్కినాక మంత్రి సామంతులతోనూ, కరణాలతోనూ సంప్రదించాలి. తర్వాత అంగమర్దనమూ, మల్లురతో వ్యాయామమూ ఆపై స్నానమూ అయిపోవాలి. వేటకాండ్రు తెచ్చిన మాంసాదుల వంటకాన్ని గురించి ఆదేశం యివ్వాలి. భోజనానంతరం విదూషకునితో వినోదాలు,పౌరాణికులతోనూ, కవులతోనూ గోష్ఠి, నాల్గవఝామున చారులకు దర్శనము· పాటకచేరి, తర్వాత ప్రేయసీ సల్లాపాలు, సుఖనిద్ర - ఇవీ దైనందిన కార్యక్రమాలు. కృష్ణదేవరాయలీ విధంగానే జీవించే వారు.

పరదేశరాయబారులు ఆయన దర్శనం కోసం పడిగాపులు కాసేవారు. అంత రాజసమూ అంత లెక్కలేనితనమూ అన్నమాట!

రాజుల ఆహారం వేటమాంసం, జాంగలామిషం (కముజుపూరేడు అడవిపంది మొదలగువాని మాంసం) శాల్యన్నం (వరి అన్నం) అధికమైన కొత్తనెయ్యి. భోగ ఆహారం అన్నమాట. తర్వాత కస్తూరి కర్పూరాలతోడి తాంబూలం. ఇదీ రాజభోగం.

అటువంటి ఆహారం రాజులు తింటారు. అది సర్వ సామాన్యమే. మామూలు జనం ఏంతింటారో ఆ రాజులకూ అందరికీ తెలుసు. అటువంటప్పుడు (కాపుల), రెడ్ల ఆహారము చూచి రాయలు నవ్వాడని అనడం సబబు గాదు.

గురగుం జెంచలి దుమ్మి లేదగిరిసాకుం దింత్రిణీ
వల్లవో
త్కరముంగూడ బొరంటి నూనియలతో, కట్టావి
కుట్టా రుకో
గిరము ల్మెక్కి, తమింబసుల్పాలమువో గ్రేపుల్మెయి
న్నాక, మే
కెరువుం గుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి
రెడ్డజడిన్. ఆ. 4-134

రెడ్లయొక్క ఆహారాన్ని రాయలవారు ఎగతాళి చేశారని కొందరన్నారు. అదితప్పు. తన ప్రజలనే తాను ఎగతాళి చేసేటంత అల్పుడూ, పిచ్చివాడూగాడు రాయలు. ఎవరెవరు ఏమేమి తింటారో స్వయంగా చూసినవాడు రాయలు. రాజులు మంచి మంచి మాంసాలతో, నేతితో ఆరగిస్తూవుంటే కాపులు బీదలుగాబట్టి ఆకుకూరలు తింటున్నారు. శాల్యన్నం రాజులుతింటే రైతులు ఆరుకల భోజనం భోంచేస్తారు. వర్షాకాలంలో రాజులు అగరు చెక్కలతో మండే బండికుంపటి

పెట్టుకొని చలిగాచుకొంటే, రెడ్లు మేకెరువుంగుంపటితో చలి కాచుకుంటారు. అది రైతుల జీవితం.

మరొక విషయం. ఏ విమర్శకుడు గూడా చెప్పని విషయం ఒకటున్నది. రాయలసీమ పశ్చిమోత్తర ప్రదేశాల లోని రెడ్లు శాకాహారులు; వీళ్లు రైతులు గదా. మాంసం తింటారు గదా అని అందరూ అనుకుంటున్నారు. కాబట్టే రాజులు మాంసాహారం తింటూవుంటే బీదలయిన రెడ్లు గురుగాకు, చెంచలాకు, తుమ్మిఆకూ లేత తగిరిసాకు, చింతచిగురు నూనెలతో పొరటి ఆరుకల అన్నంతో కలిపి తినేవారు. అది రైతుల ఆహారం. బీదల ఆహారం స్వాభావికంగా వర్ణించుటే గాని రెడ్లజీవితాన్ని ఎత్తిపొడిచినట్లు చెప్పాడనడం అపచారం. తన పాలిత ప్రజలను రాయలు ఎగతాళి చేస్తాడా ? వాళ్ళేమయిన తనసాటివారా? గతంలో యుద్ధాలలో రెడ్లు (రాష్ట్రకూటులు) ఓడిపోయి బీదలయ్యారు గాబట్టే ఆక్షేపణ పూర్వకంగా హాస్యంచేశాడని అనుకోవడం తప్పు. "ప్రభుత్వైకాప్తి రెడ్లజడిన్" అన్నదాన్ని చూచి రాయలు అపహాస్యం చేశాడని అన్నారు కొందరు. కాదు. రైతువృద్ధుల జీవితాన్ని స్వాభావికంగా వర్ణించాడు రాయలు. అంతే! ఆ రోజుల్లో కుల వృత్తులపై శ్రద్ధా, కర్మ సిద్ధాంతమూ, రాజభయమూ వుండేవి గాబట్టి - ప్రజలు తమ జీవితాన్ని ఆ విశ్వాసాలతోనే గడుపు కొనేవారు. అంతకుమించి యెవరూ ఆశించేవారు గారు.

కవియేదయినా వర్ణించగలడు. అలంకార సహాయంతో యెన్ని వర్ణించగూడదు? స్వానుభవం వున్న కవి అయితే ఇంకా సార్థకంగా వర్ణించగలడు. భక్తి విషయంలో స్వానుభవం వుంది కృష్ణదేవరాయలకి. ఆయన తిరుపతి వెంకటేశ్వర స్వామి భక్తుడు. ఎన్నో దేవాలయాలు కట్టించాడు. మడులూ మాన్యాలూ యిచ్చాడు. అంత భక్తుడు గాబట్టే విష్ణుచిత్తుణ్ణి, గోదాదేవిని, యామునాచార్యుని, ముఖ్యంగా మాలదాసరిని అంతబాగా వర్ణించగలిగాడు. మాలదాసరి అసలు రాయలే. భక్తిపారవశ్యం రాయలకు లేకపోతే, మాలదాసరి భక్త్యావేశాన్ని అంత హత్తుకొనేలా వర్ణించలేడు. మాలదాసరి భక్తి చూడండి. ఇదొక వేదనాదంలా వుంది.

గండాభోగముల న్మదశ్రులహరుల్గప్ప న్నుతుల్పాడి
యా
దండ న్వ్రేగులు డించి భక్తి జనితోద్యత్తాండవం
బాడు, నా
చండాలేతర శీలుడుత్పులకుడై చాండాలిక న్మీటుచున్
గుండు ల్నీరుగ, నెండ గాలి వసి తాకుం జూడ,
కాపాహ్ణమున్. 6-7

(చాండాలిక న్మీటుతూ ఆనందాశ్రువులు రాలుతూ వుండగా విష్ణునామ సంకీర్తనలు పాడి పాడి, తిరిపెమెత్తుకొనే సంచులు

క్రిందపెట్టి - భక్తి అతిశయింపగా తాండవం చేస్తూ పులకలు రేగుతూవుండగా ఎండా, గాలీ, ఆకలీ లెక్కించకుండా ఆ మాలదాసరి నృత్యం చేసేవాడు)

ఇటువంటిదే మరొక వేదనాదం లాంటి పద్యం చూడండి. విష్ణుదేవుడు విష్ణుచిత్తుని పిలిచి నీవు మధురానగరి కేగి వాదించి ఆ రాజును వైష్ణవుణ్ణి చెయ్యాలి అన్నపుడు విష్ణుచిత్తుడు అన్న సమాధానం చూడండి.

'స్వామీ, నన్ను, నితఃపురా పఠితశాస్త్రగ్రంథ
జాత్యంధు, నా
రామక్ష్మాఖనన క్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు, న్భవద్భవనదాసు, న్వాదిగా బంపుచో
భూమీభృత్సభ నోటమైన నయశంబు ల్మీకు
గాకుండునే? 2-90

(స్వామీ। నేనేమీ శాస్త్రాలు చదవలేదు. ఏదో నీ పూలతోటలో నిత్యమూ దేనికో ఒకదానికి భూమిని త్రవ్వటలో చేతులంతా కాయలుకాచినవాణ్ణి. నీ దేవాలయ దాసుణ్ణి. నన్ను వాదించమని మధురకు పంపితే, నేను ఓడిపోనా? అది నీకు అపయశము గాదా) చాలా వినమ్రతతో అన్న మాటలవి. ఎంతగొప్ప వాడయితే అంత వినయం వుండాలి గదా! తర్వాత అతడు మధురలో గెలుస్తాడు. అది విష్ణు మహిమ వల్లనే గదా!

ఇక గోదాదేవి విరహాది వర్ణనల్లోనూ, దశావతార వర్ణనల్లోనూ, దేవాలయ వర్ణనల్లోనూ, రాయలు విష్ణుభక్తి పారమ్యం సుస్పష్టం.

శ్రీకృష్ణదేవరాయలు మహాయోధుడు - మహాకవి - మహాపండితుడు. వేదవేదాంగ, యోగశాస్త్ర నీతిశాస్త్ర పారంగతుడు. అలంకారాది కావ్యశాస్త్రమర్మజ్ఞుడు. ఇన్ని గుణాలూ మనకు సర్వవర్ణనా ప్రధానమైన ఆముక్తమాల్యదనుండే తెలుస్తున్నాయి.

రాయలు మహా కావ్యకర్తగా ఎంతయినా వ్రాయవచ్చు. ప్రతిపద్యం పైనా ఎన్ని విధాలయిన చర్చలయినా చెయ్యవచ్చు. ఎక్కడో ఒకచోట అంతంచెయ్యాలి.

రాయలవారి అంత్యదశ అంత తృప్తికరంగా సాగలేదని మనకు చరిత్రలవల్ల తెలుస్తున్నది. తన కుమారుడైన తిరుమలరాయనికి పట్టాభిషేక మహోత్సవాలు ఆరు నెలలు జరిగినట్లు తెలుస్తున్నది. ఆ బాలుడు అల్పాయుష్కుడయ్యాడు. అతడు చనిపోవడానికి కారణం తిమ్మరుసూ, అతని పుత్రుడూ అని తెలిసి రాయలు వారిని జైలులో బంధించాడు. మూడేండ్ల తర్వాత అప్పాజీ కొడుకు తప్పించుకొని తిరుగుబాటు లేవదీశాడు.

తిమ్మరుసు కుమారుడు తిమ్మయ, దండనాయకుడు. తిమ్మరుసు తమ్ముడు గోవింద దండనాయకుడు. రాయలవారు బ్రాహ్మణులకు దుర్గాధిపత్యాలూ, దండనాయకత్వాలూ ఇచ్చాడన్న విషయం మనకు ఆముక్తమాల్యదవల్లే అక్షర లిఖితంగా తెలుస్తున్నది గదా! ఇలాంటి దండనాయకులే తిరుగుబాట్లు లేవదీసి జయించగలిగితే రాజులు కావడం సంభవిస్తున్నట్లు సర్వ రాజ చరిత్రలూ తెలుపుతున్నాయి.

అప్పాజీ కుమారుడు తిమ్మయ దండనాథుడు తిరుగుబాటు లేవదీయగానే అతన్నీ అప్పాజీనీ పట్టి బంధించి తెప్పించి కండ్లు పీకించేశాడు రాయలు.

రాయలు ఇంతకు కాస్తపూర్వమే అప్పాజీని విడిపించి తర్వాత తన తమ్ముడైన అచ్యుతరాయలను రప్పించి తన తర్వాత అతడే రాజ్యానికి అర్హుడు అని చెప్పాడు. అతని అల్లుడయిన రామరాయలు అచ్యుతరాయలకు సలహాదారుడుగా, ముఖ్యమంత్రిగా రక్షకుడుగా వుండవలెనని కోరాడు. మహాయోధుడైన కృష్ణదేవరాయలు యాభై యేండ్లు నిండకుండానే మరణించాడు.

## రాయల అనంతరం

రాయలు గతించగానే అచ్యుతరాయలు పట్టాభిషిక్తుడయినాడు. అళియ (అల్లుడు) రామరాయలు మంత్రిగా, రక్షకుడుగా అయినాడు.

అళియ రామరాయలు మహాయోధుడు. అంతటి యోధుడుగాబట్టే రాయలవారి అల్లుడు కాగలిగాడు. రాయల అనంతరం మహమ్మదీయ సుల్తానులు విజృంభించారు. రామ రాయలు వారిని ఓడిస్తూ వచ్చాడు.

ఇక్కడ విజయనగరంలోనే అశాంతి బయలుదేరింది. అచ్యుతరాయల బావమరది సలకం తిమ్మయ అంతఃపురంలో పలుకుబడి ఎక్కువ చేసుకున్నాడు. తనసోదరి వరదాంబిక చెడ్డ సలహాలవల్ల అచ్యుతరాయలు రామరాయలపై కొంత విముఖత పెంచుకున్నాడు. అయినా రామరాయలు తన మామ గారయిన కృష్ణదేవరాయల కిచ్చిన మాటకు కట్టుబడి సామ్రాజ్య రక్షణలో లోపం రాకుండా చూడసాగాడు. అనేక యుద్ధాల్లో మహమ్మదీయులను జయిస్తూ వారిని చాలా అవమాన పరిచాడు. ఈ అవమానములను భరించలేక ముస్లిం రాజులంతా ఏకం కావడానికి ప్రయత్నాలు చేయ సాగారు.

రామరాయలు గూడా కళాకారుడే. కవిపండితాది పోషణ యథారీతిని కావించాడు. అతని కాలంలో రామయామాత్య తోడరమల్లు అనే ఆయన "స్వరమేళ కళానిధి" అనే సంగీత గ్రంథాన్ని వ్రాశాడు. అనేక రకాలయిన వీణల సృష్టిని రామరాయల కాలంలో కావించాడు. ఈ నాటి వీణా స్వరూపాన్ని అప్పుడే నిర్మించారు.

బీజాపూర్,బీదర్, బీరార్, అహ్మద్‌నగర్ గోల్కొండ సుల్తానులు వివాహబంధాలతో చుట్టరికాలు నెరపుకొని, కూడ బలుకుకొని అశేష సైన్యాలతో రక్షస్తగిడి దగ్గర విడిది చేశారు. రామరాయలది విని కోపోద్రగుడై ఎనలేని సైన్యంతో సుల్తానులపై పడ్డాడు.

1565 లో, ఈ రక్షస్తగిడి యుద్ధం జరిగింది. ఎన్నెన్నో వ్యూహాలు పన్ని రామరాయలు సుల్తానుల సైన్యాలను చీకాకు పరిచాడు. సుల్తానులకు దిక్కు తోచలేదు. హిందూ సైన్యాలు ముందుకు చొచ్చుకొని వస్తున్నవి. అరటిబోదెల్లాగా సైన్యాలను నరుక్కుంటూ వస్తున్నవి. ఈ సమయంలో ఒక గొప్ప మార్పు జరిగింది. రామరాయల సైన్యంలో వున్న ఒక ముస్లిం సైన్యాధిపతి తటాలున సుల్తానుల పక్షమైనాడు. కొంత కలకలం బయలు దేరింది. ఈ సమయంలో రాగినాణేలుపోసి

పిరంగులు పేల్చారు సుల్తానులు. హిందూ సైన్యం గుగ్గిళ్ళ వలె రాలిపోయింది. సైన్యం చిందరవందర అయింది. మహా వీరుడైన రామరాయలు రాచవారికంతా ఉద్బోధించి, సైన్యాన్ని ప్రోత్సహించి, రోషం నూరిపోసి ముస్లిం సైన్యంపైకి పురి కొల్పాడు. రామరాయలు భీష్మునిలాగా విజృంభించి గరుడా గరుడా' అని ఉచ్చైస్వనాలతో అంటూ సింహనాదం చేస్తూ వైరి సైన్యాన్ని చిత్రవధ కావింపసాగాడు.

సరిగ్గా ఈ సమయంలో రామరాయలును ఒక ఫిరంగి గుండు తాకింది. చాలామంది యోధులకు గూడా తగిలాయి. హిందూసైన్యాలు దిక్కులు చూడసాగాయి. క్షతగాత్రుడైన రామరాయలు ఉగ్రుడై ఉత్తుంగ తురంగమునెక్కి ఖడ్గాన్ని ఝుళిపిస్తూ వైరివీరులపైబడి తరగసాగాడు. అతని ప్రళయ భీకరాకారాన్ని చూచి వైరులంతా లేళ్లవలె పారిపోసాగారు. రామరాయల శరీరంనుండి రక్తం ధారలుగట్టి ప్రవహిస్తూనే వుంది. బలం క్షీణించిపోతూ వుంది. ద్రోణాచార్యుడులాగా అస్త్రసన్యాసం చేశాడు. నిరస్త్రుడైన రామరాయలను కలిసి పట్టుకున్నారు వైరియోధులు. సరాసరి నిజాం షా కడకు లాక్కుపోయారు. నిజాం షా కళ్లమంటలప్పటికీ చల్లారలేదు. రామరాయలు పట్టుపడటం తృప్తినీయలేదు. తనపగ సాధించు కోడానికి పళ్లు పటపట కొరుకుతూ అవహేళనగా చూస్తూ,

ముందుకు వచ్చి కాఫిర్ కాఫిర్ అని పళ్ళు బిగబట్టి "యిరవై యేళ్ళుగా ఈతలయేగదా మమ్ములవేధించింది" అంటూ నిర్ ్రసుడై అసహాయస్థితిలో వున్న డెబ్బదేండ్ల వృద్ధుణ్ణి తన తండ్రివంటి వానిని తనను నిన్నటివరకూ కొడుకులాగ ఆదరించిన వాణ్ణి, పండిన తలను పట్టుకొని, ఆనాడు ధృష్టద్యుమ్నుడు గురువుగారైన ద్రోణాచార్యుని తల నరికినట్లుగా తటిగి, అప్పటికీ కసితీరక, జండా కఱ్ఱకు గట్టి ఆకాశానికి ఎత్తాడు. వికటాట్టహాసం గావిస్తూ ఊగిపోయాడు.

నలభై సంవత్సరాలకు పైగా ఘోరాతి ఘోర సంగ్రామాల్లో పోరుతూ హిందూ సామ్రాజ్య రక్షకుడై మహమ్మదీయ సుల్తానుల పక్కబల్లెమై, రాజనీతి చతురుడైన అళియరామరాయలు అస్తమించాడు. విజయనగర భానుడస్తమించాడు.

ఆంధ్ర సైన్యాలు ఆందోళన చెందాయి. బెదిరిపోయి చెల్లాచెదరయ్యాయి. అనాథలై పారజొచ్చాయి. రామరాయల సోదరుడైన తిరుమలరాయలు వెంకటపతి రాయలు తమ తమ సేనలతో పారిపోజొచ్చారు. సుల్తానుల సైన్యాలు వెన్నంటి తరిమాయి. దారిలోని గ్రామాలన్నిటినీ కొల్లగొట్టాయి. కనబడిన స్త్రీలనెల్లా మానభంగం కావించాయి.

వచ్చి వచ్చి విజయనగరంపై పడ్డాయి. రత్నమయ సౌధాల రజం కావించాయి. మహోన్నత దేవాలయాలను బ్రద్దలు కొట్టాయి. గజహయశాలలు కూల్చివేశాయి. వినోదశాలల నాశనం చేశాయి. భువనవిజయాన్ని భూపతనం చేశాయి. విగ్రహాల విధ్వంసం చేశాయి. ఆరామాల నేలమట్టం గావించాయి. ఇట్లారు మాసాలపాటు విజయనగర విధ్వంసం గావించాయి.

కృష్ణనుండి కన్యాకుమారి వరకూ విస్తరించి సర్వాధిపత్యాలు నెరపిన విజయనగర సామ్రాజ్యం అంతరించింది. కవిత్వానికీ, శిల్పానికీ, సంగీతానికీ తదితర కళలకూ ఆలవాలమై వెలసిన విజయనగర సామ్రాజ్యం అంతరించింది. మహోన్నత చక్రవర్తి అయిన శ్రీకృష్ణదేవరాయలు పెంచి పోషించిన విజయనగర సామ్రాజ్యం అంతరించింది. ఆంధ్ర రాజ్యం విస్మృత రాజ్యమైపోయింది.

మతం ఎంత చెడ్డదో తెలిసిపోయింది. మతస్పర్థలు ఎంత వినాశకారులో తెలిసిపోయింది. మహమ్మదీయ మతం లాగా కుల వ్యవస్థలోవున్న వీరికికూడా మతం వుండివుంటే, మహమ్మదీయమతం అంతగా వ్యాప్తి పొందేది గాదు. వాళ్ళు

హిందువులనెల్లా యెలాగయితే మతం మార్చి సంఖ్యాబలాన్ని పెంచుకున్నారో-హిందువులది గూడా మతమే అయివుంటే-ఆ మారిపోయిన వారిని మరలా హిందూ మతంలోకి మార్చివేసి వుండేవారు. ఏకతాభావమూ, ఏక దైవభావమూ లేని సంఘం గాబట్టి - మతంగాదుగాబట్టి - "నీవు వేరు, నేను వేరు" అనే కులవ్యవస్థ గాబట్టి, మతం కాలేకపోయింది. తనలోనుండి ఎంతో మందిని అన్యమతంలోకి తోసేసిందేగాని, మహమ్మదీయుల్లాగా తమలోకి ఇతర్లను ఆకర్షించుకోలేకపోయింది. ఆవిధంగా మహమ్మదీయ మతం పెరిగిపోవడానికి ప్రత్యక్ష అప్రత్యక్ష కారణమైంది. మత వైషమ్యాలు పెరిగి, పెట్రోలు మంటల్లాగా మండి, 1947 లో దేశవిభజనకు కారణమైంది. ఇన్ని శతాబ్దాలుగా చవిచూస్తూ గూడా ఇప్పటికీ తెలివి తెచ్చుకోలేకపోతున్నవి ఈ హిందువులు అనబడే కులవ్యవస్థా కీటకాలు.

కులగురువులూ, మతాధిపతులూ, పీఠాధిపతులూ ఇప్పటికి గూడా అన్యమత తిరస్కారమూ, మతవిద్వేషమూ పురికొల్పుతున్నారేగాని ఈ జనాన్నంతా ఒక్కటి చేద్దామన్న సంకల్పం లేదు. అన్యమత ద్వేషాగ్నిలో ఆజ్యం పోయడం మానలేదు. ఆ మతంమాదిరి మనదిగూడా మతం అయివుంటే వాళ్ళంతా మన మతంలోకి మారిపోయి వుండేవారు. హిందూ

స్థాన్, పాకిస్థాన్, బంగ్లాదేశ్‌లు అసలు యేర్పడి వుండేవి గావు. అన్యమతస్థుల జనసంఖ్య చాలా కొద్దిగా ఉండేది. ఈనాడున్నట్లుగా యిన్ని కోట్ల ముస్లిములుండేవారుగాదు. మహా అయితే అఖండ హిందూస్థాన్‌లో నాలుగైదు లక్షలుండే వారేమో! మనదిగూడా ఒక మతం అయివుంటే మహమ్మదీయులతో మత ఘర్షణ వచ్చివుండేదేగాదు. రాజకీయంగా ఘర్షణ వచ్చివుండవచ్చు. అది వేరు. సాఘికంగా ఘర్షణలు వచ్చివుండేవిగావు. క్రైస్తవులతో యెలాంటి మత ఘర్షణలు లేనట్లే మహమ్మదీయులతో గూడా మత ఘర్షణ లేకుండా వుండేవారు. ప్రపంచంలో ఏ దేశంలో గూడా ముస్లింమతానికి అక్కడి మతాలతో ఘర్షణ లేదు. మరి హిందూ దేశంలో యెందుకుంది? ఇదంతా హిందువులనబడే వారిలోవుండే కుల వ్యత్యాసాలవల్ల, హెచ్చు తక్కువలవల్ల అంటరానితనంవల్లా ఇతర మతస్థులనుగూడా నీచంగా చూడడంవల్లా - అంతే. మనదీ ఒక మతం కావాలనిగాదుగాని, ఆనాడు అలావుండి వుంటే బాగుండేది అని అనిపించింది. ఈనాడు మనకు కావలసింది సమసమాజం. సామ్యవాదమే వున్ననాడు మతానికి గూడా తావుండదుగదా! కులమతాల అవసరం వుండదుగదా!

